# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకోలెట్ మిల్క్ డ్రింకు

మీ కార్యక్రమాన్ని ప్రతిరోజూ ఉత్సాహంగా ప్రారంభించడంకోసం మీకుకూడా, రైలుమోటారుగా, యింధనం కావాలి శక్తినిచ్చే యింధనం మిమ్మల్ని రోజల్లా చురుకుగా వుంచి, చకచకా పనులు చేసుకునేటట్లు చేస్తుంది అందుచేతనే మీకు ప్రతి ఉదయం బూస్ట్ కావాలి ముఖ్యంగా మీ పిల్లలు పనిలోనూ, ఆటల్లోనూ అదనపు శక్తిని వినియోగిస్తారు వారికి బూస్ట్ యివ్వండి ఇది కొత్త మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' వారు తయారు చేసిన సహజంగా లభించే ఆహారంతోనూ, విటమిన్లతోనూ, ఖనిజాలతోనూ బూస్ట్ తయారు చేశారు. దీనిలో పూర్తి మీగడపాలు, గోధుమ, బార్లీ మాల్టు మరియు కోకో వున్నాయి సమృద్ధిగా మీగడతో కూడిన మాల్ట్ చాకొలెట్ రుచి దీనికి వుంది. మీ కుటుంబమంతా యిష్టపడుతుంది. బూస్ట్ మీ రోజుని ప్రారంభించేందుకు ఇది ఉచితమైన మార్గం—ప్రతిరోజూ

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-3945-A Tel.

ఆంధ్రప్రదేశ్ మరియు కేరళలో మాత్రం లభించును.

లోకం పోకడ — ఊమెన













**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 9–4–'76

నలనామ సం. చైత్ర శు. దశమి

**సంపుటము : 69 సంచిక : 31**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు. 33–80

ఆరుమాసాల చందా – రు. 16–90

విడి ప్రతి వెల 60 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ–520003.

# విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
'మాపూరి కథ'లో కృష్ణ, జయప్రద

**కథలు :**

తుఫాను ... 7
ఎర–వల ... 12
అర్ధాంగులఆర్థికస్వాతంత్ర్యాలు 28

**సీరియల్ కథలు :**

వెలుగుబాట (ప్రారంభం)... 9
కాలమిచ్చిన తీర్పు ... 19

**వ్యాసాలు, శీర్షికలు :**

లోకంపోకడ–4, ఉత్తరాలు–6, పంసలం–13, ధర్మపథం, హైదరాబాద్ నోట్‌బుక్–16, సినిమా–24, డాక్టర్ సలహాలు–29, ప్రశ్నావళి–32, సామాన్యుని సణుగుడు – 34, ఏప్రిల్‌ఫూల్ (కార్టూన్లు)–42, ఫిలాక్కు నిదైకి–43, పెండ్లిఫోటోలు–46.

[ గతవారం 6వ పేజీలో పడ్డవి ఉగాది కార్టూన్లు కాగ, ఏప్రిల్ ఫూల్ కార్టూన్లు ఈవారం వచ్చాయి. సం. ]

P is for Podar Textiles
Look for it when you want to look this good









**PODAR textiles**

**suitings ★ shirtings and sarees**

# మనలో మాట

ఆంధ్రసచిత్రవారపత్రిక ఫిలిం బ్యాలట్ ఫలితాలు :

- ముత్యాల ముగ్గు
- దాసరి నారాయణరావు
- వాణిశ్రీ
- శోభన్‌బాబు
- రమాప్రభ
- రాజబాబు
- రోజారమణి
- మురళీమోహన్
- కె. వి. మహదేవన్ . . .

## ముత్యాల ముగ్గు


దాసరి నారాయణరావు


కె. వి. మహాదేవన్


వాణిశ్రీ


శోభన్‌బాబు

1975లో విడుదలైన తెలుగు కథాచిత్రాలలో మా పాఠకులకు ముత్యాల ముగ్గు ఎక్కువ యిష్టమైంది. శ్రీ దాసరి నారాయణరావును తిరిగి '75 ఉత్తమ దర్శకునిగా మా పాఠకులు మెచ్చుకున్నారు. కుమారి వాణిశ్రీ ఉత్తమ నటి స్థానాన్ని, శ్రీ శోభన్‌బాబు ఉత్తమ నటుని స్థానాన్ని మరోసారి కూడా ఘనంగా నిలబెట్టుకున్నారు.

ఈసారి మా పాఠకులకు తమకు నచ్చిన హాస్య నటిని కూడా ఎన్నుకునే అవకాశం కల్పించాము. ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఫిలిం బ్యాలట్‌లో ఎన్నికైన తొలి ఉత్తమ హాస్యనటి శ్రీమతి రమాప్రభ. ఆమెకు మిగతా అందరికన్నా ఎక్కువ శాతం ఓట్లు పోలవడం విశేషం. అలాగే మన ప్రేక్షకులలో హాస్య నటునకు గల ప్రత్యేకాదరణకు నిదర్శనంగా శ్రీ రాజబాబు మరోసారి చాలా ఎక్కువ ఓట్లు 'పోలు' చేసుకుని తన ఉత్తమ హాస్యనటు స్థానాన్ని నిలబెట్టుకున్నారు. శ్రీ కె. వి. మహాదేవన్ సంగీతం మా పాఠకులకు యీసారి కూడా అమితంగా నచ్చింది. అయితే యీసారి ఉత్తమ సహాయ నటులుగా, యిద్దరు వర్ధమాన నటులు వెలుగులోకి వచ్చారు. వారిని మా పాఠకులు ఎక్కువ ఓట్లతో ఆదరించారు. కుమారి రోజారమణి ఉత్తమ సహాయ నటిగా రాణిస్తే శ్రీ మురళీమోహన్ ఉత్తమ సహాయ నటుడిగా ఎన్నికైనారు.


రాజబాబు


మురళీమోహన్


రమాప్రభ


రోజారమణి

**బ్యాలట్ విజేతలకు, అందులో పాల్గొన్న పాఠకులకుకూడా మా ప్రత్యేక శుభాభినందనలు !**

# ఉత్తరాలు

నాచికేతుని కథ

12-3-76 ఆంధ్ర సచిత్ర వారపత్రిక కథలో మీరు ప్రచురించిన నాచికేతుడు కథవలన రామాయణ మహాభారతములలో ఏది ముందు జరిగినది అన్న అనుమానము కల్గుచున్నది.

ఈ కథలో రామాయణంలోని రఘుమహారాజు కుమార్తె చంద్రవతి మహా భారతంలోని కుంతిని ఆదర్శంగా తీసుకోడం నిజంగా మాకు ఆశ్చర్యాన్ని కల్గించినది.

మా యొక్క ఈ ధర్మ సందేహాన్ని రచయితగారు తీరుస్తారని వేయి కళ్ళతో ఎదురు చూస్తున్నాము. మోహన్ (నాగపూర్)

[పలువురు పాఠకులు యిట్టి సందేహాన్నే వెలిబుచ్చుతూ ఉత్తరాలు రాశారు. రచయిత కథాప్రపూర్ణ శ్రీ వేంకటరావుగారి సమాధానాన్ని యిక్కడ పొందుపరుస్తున్నాము. — సం.]

* * *

నాచికేతుని కథలో (13-3-76 ఆంధ్ర సచిత్ర వారపత్రిక) నేను, చంద్రవతి కొన్ని వేల యేండ్ల తరువాత నున్న కుంతివలె, తన బిడ్డను మందసంలో పెట్టి గంగలో విడువవలెనని వ్రాసినాను—దానివల్ల పాఠకలోకమునకు సందేహముకలిగినది. అట్లు కలుగుట సమంజసమే. ఆ సందేహమును తీర్చుచున్నాను. ఒక్క గ్రంథము నుండియే దృష్టాంతమును యిచ్చెదను.

ముందటి కాలములో జరిగిన కథా సందర్భమును తరువాతి కాలమునకు జరిగిన కథలలో సందర్భానుసారంగా, ఉటంకించుట అనేది ఒక కవి సమయం దీనినే ఆంగ్లభాషలో "ఏనాక్రానిజమ్" అంటారు. తెలుగులో దానిని కాల వ్యత్యాసము అని అనవచ్చును. సరే ఆంగ్ల భాష విషయం యెందుకు? తెలుగు కావ్యాలలో నిదర్శనం ఇట్టివి ఆ ప్రాచీనకథలు చదవడానికి అభిరుచి కలిగించును.

శ్రీ హర్షుడు నలదమయంతుల కథ నైషధీయ చరితగా సంస్కృతములో వ్రాశాడు దానినే శ్రీనాథ మహాకవి శృంగార నైషధముగా

(45వ పేజీ చూడండి)

ఎదురుగుండా గోడమీది గడి యారం గంటలు కొట్టడం ప్రారంభించే సరికి ఉలిక్కిపడి తలెత్తి చూసాను. ఎనిమిది. బయటికి చూసాను చిరాగ్గా. యింకా ఓ పది మంది పేషెంట్లున్నారు.

కనీసం ఈరోజైనా అన్నమాట తప్ప కూడదు. వెధవది నెల్లాళ్ళనుంచి ప్రయత్నిస్తున్నా శ్రీమతి కోరిన చిన్న కోరిక తీర్చ లేకపోతున్నాను. ఈరోజు తప్పకుండా తీరుస్తానని మాట యిచ్చాకనే బయట అడుగు పెట్టనిచ్చింది ఉదయం. అది గుర్తొచ్చి మరో పావుగంటలో అందర్నీ పంపేశాను. కంపౌండరుతో చెప్పి బయట అడుగు పెడుతున్నంతలో బయటనుంచి విమానంలా దూసుకొని వచ్చింది ఒక అమ్మాయి. వస్తూనే అక్కడున్న బెంచీమీద కూలబడి రొప్ప సాగింది. సుమారు యిరవై ఏళ్ళుంటాయి.

'ఏమిటి ?' నా కంఠంలో ఎన్నడూలేని విసుగు నన్నే ఆశ్చర్యపరచింది.

మాట్లాడలేకపోతున్నదామె. చివరికి పడిపోతున్న కనురెప్పలెత్తి 'విషం' అంది బొటన వేలితో మంచినీళ్ళు కావాలన్నట్టు చూపిస్తూ.

ఒక్కక్షణం నాకేమీ అర్థమవలేదు. బుర్రంతా తెల్లని కాగితంలా బ్లాంక్‌గా తయారయింది. వెంటనే మెరుపులా ఓ ఆలోచన వచ్చింది. బహుశా ఈమెకెవరేనా విషమేదైనా యిచ్చివుండచ్చు. దాన్ని చెప్పడానికి అలా సంజ్ఞచేసిందేమో అన్పించింది.

కంపౌడరుని పిల్చి తొందరగా 'స్టొమక్ వాష్' కోసం ఎరేంజ్ చెయ్యమనిచెప్పి పల్సు చూసాను. వేగంగా కొట్టుకుంటున్నాది! త్వరగా స్టొమక్‌వాష్‌చేసి హాస్పిటల్‌లో వున్న ఒక్క బెడ్ ఎలాట్‌చేసి 'ఈమెకేం పర్వాలేదు ఏమైనా కావలిస్తే యింటికి ఫోన్‌చెయ్యి.' అని నర్స్‌తోచెప్పి బయటపడ్డాను.

* * *

ఒకరోజు మామూలుగా సాయంత్రం కాలేజీనుంచి యింటికొచ్చింది సుబ్బలక్ష్మి. గేటుతియ్యగానే గుమ్మంలో హీరోలా నిలబడిన రాజారావును చూసింది. చూడగానే అతను రాజారావని, తరవాత కాలంలో అతను విసిరిన వలలో తను పడుతుందని అప్పటికి తెలీదామెకి పాపం!

సాయంసంధ్యలా హుందాగా నడిచివస్తున్న సుబ్బలక్ష్మినే చూస్తున్నాడు రాజారావు.

సుబ్బలక్ష్మికి అసహ్యమనిపించింది. పశువులా అలా చూస్తాడేం తినేసినట్టు. అయినా యితనెవడు ఎటునుంచి చుట్టం. ఎందుకొచ్చాడు అని మనసు అప్పుడే ఆరాతీయడం మొదలెట్టింది. సుబ్బలక్ష్మి మెట్లెక్కుతుంటే ఆమెను ఏడిపించాలనిపించింది రాజారావుకి.

'ఎవరు మీరు ? ఏం కావాలిక్కడ ?' అని నిలదీశాడు.

ఆ ప్రశ్నవిని స్థంభించిపోయింది సుబ్బలక్ష్మి. తమ యింటి మెట్లెక్కుతుంటే అలా ప్రశ్నిస్తే ఏమనిచెప్తుంది. అయినా ఈ ఇల్లు తనదన్నట్టు మాట్లాడుతున్నాడేమిటీ?

'ఏం ఈ వూరికి కొత్తగా వచ్చారా మీరు?' అని అడిగి లోపలికి దారితీసింది.

'మరేం అలా వూరొకసారి చూపించరూ!' వెనకనించి వచ్చిన మాటవిని వెనక్కు తిరిగింది చివాలున. అతని పెదవుల నుంచి చిరునవ్వు జాలువారుతొంది. కళ్లలో చిలిపితనం గంతులేస్తుంధి.

'ఛ ఛ మాట్లాడ్డం నాదే తప్పు' అని లోపలి కెళ్ళిపోయింది.

'అమ్మా...అమ్మా...'

ఎక్కడో పెరట్లో వున్నావిడ వచ్చింది 'ఏమిటే కాలేజీ నుంచి రాగానే మొదలయిందీ నీ గోల. ఆ ఫ్లాస్కులో కాఫీ వుంది తాగు' అంటూ.

'అమ్మా మనింటి కెవరయినా చుట్టాలొచ్చారా ?'

'లేదే, ఆయినా ఈ వేళప్పుడు వచ్చే చుట్టాలు, పక్కాలు ఎవరుంటారు ?'

'మరి ఆ గదిలో వున్నతనెవడు ?' సుబ్బలక్ష్మి కంఠంలో కోపం, ఉత్సుకత.

'తప్పే ! ఎవడు గివడు అనకు. అతను చాల మంచివాడు. వింటే బాధపడతాడు. ఈ వూర్లోనే ఏదో వుద్యోగం చేస్తున్నాడు. అతనికి మన ముందర గది అద్దె కిచ్చాము.' అని తన గొడవలో తను పడిపోయింది.

'నువ్వెప్పుడూ యింతే. ప్రతీ వెధవనీ మంచివాడు, గించివాడు అంటూ నెత్తి కెక్కించుకుంటావ్. వాడి సంగతి నీకేం

# తమషాను

విజయ్



తెలుసు' అని మనసులోనే తిట్టుకుంటూ విసురుగా అక్కడి నుంచి కదిలింది సుబ్బలక్ష్మి.

నా సంగతింకా తెలియనట్టుగా వుంది. వెళ్లి 'రండీ అలా వూరు చూసొద్దాం'అంటే ఏమంటాడో. ఏమంటాడు, క్రింద మీద పడి 'అబ్బెబ్బె. ఎందుకండి ఏదో సర్దాకన్నాను. క్షమించండి అని వాళ్లబేరాని కొస్తాడు. ఈ రోజుల్లో ప్రతీ వెధవకీ యిదొక ఫేషనయి పోయింది ' అనుకొని అందంగా తయారయి అతని గదికి దారి తీసింది.

సుబ్బలక్ష్మి అతని గదిలో కాలు పెట్టే సరికి అద్దంలో చూసి దువ్వుకుంటున్నాడు. పక్కనుంచి అతని రూపం తీర్చిదిద్దిన గ్రీకు శిల్పంలా వుంది.

సుబ్బలక్ష్మి నొకసారి విచిత్రంగా చూసి 'రండి మీరొస్తారని తెలుసు. అందుకే ఎదురు చూస్తున్నా' అని కుర్చీ చూపించాడు.

'ఏమిటితను? తనొస్తానని అతనికి తెలుసా?' ఎలా తెలుసు! నా కోసం ఎదురు చూస్తున్నాడా? అంతా యింద్ర జాలంలా వుందే అనుకుంది.

ఆ రాత్రి యింటికొచ్చేసరికి మానసికంగా

## తుఫాను

అతని వశమయిపోయింది సుబ్బలక్ష్మి. అతని మాటలు, చేష్టలు ఆమెను నవ్వించాయి. కవ్వించాయి. మొదటెంత విసుక్కుందో తరవాత అంత పెనవేసుకుపోయింది.

ఆ మర్నాడు కాలేజీలో ఫస్టవర్ కొత్త లెక్చరర్ రాక కోసం స్టూడెంట్సంతా ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. రాజారావు అడుగుపెట్టడంతో గోలంతా అణిగింది. తలెత్తి చూసిన సుబ్బలక్ష్మి గుండెలు ఝల్లు మన్నాయి.

మూన్నెళ్ల తరవాత ఒకసారి సినిమా హాల్లో రాజారావుని, సుబ్బలక్ష్మిని పక్క పక్కన చూసినవాళ్ల అత్తకొడుకు రమణ మూర్తి సుబ్బలక్ష్మిని నిలదీసి అడిగాడు. 'ససేమిరా నిన్ను పెళ్లి చేసుకోను ఫో' అని చెప్పేసింది సుబ్బలక్ష్మి.

ఆరోజు రాత్రికి సుబ్బలక్ష్మికీ ఒక కల వచ్చింది. ఆ కలలో వాళ్ల అత్తయ్య కాఫీలో ఏదో తెల్లటి పొడరు కలిపి తనకు యిచ్చి నట్టు. ఆ తరువాత తను మొహం తిరిగి పడి పోయినట్టు. ఆ తరవాత పడిపోయిన తనను రాజారావు చేతుల్లోకి తీసుకుని ఏడుస్తున్నట్టు ఉలిక్కిపడి లేచింది గాబరాగా. కళ్లు నులుము కొంది. చుట్టూ చీకటి. తన గాబరాకి నవ్వు కొని తిరిగి పడుకొంది.

ఆ సంఘటన మర్చిపోయిన కొన్ని రోజుల తర్వాత ఏదో పనిమీద పక్కవీధిలో వున్న అత్తగారింటికి వెళ్లింది. 'ఏమే పిల్లా మరీ నల్లపూసవైపోయావ్. ఎక్కడా కనిపించట ల్లేదు.' అని ఆప్యాయంగా పలకరించి ఓ కప్పు కాఫీ యిచ్చిందావిడ. అది తాగేసిన తర్వాత గుర్తొచ్చింది సుబ్బలక్ష్మికి కలసంగతి. కాఫీ కలిపినచోట చిన్న పొట్లం లాంటి కాగితం కనబడింది. అంతే..."

"నీకేం ఫర్వాలేదు భయంచేత చాలా నీరసంగా వున్నావు అంతే. అనవసరంగా ఆలో చించి బెంగపెట్టుకోకు' అని అభయహస్త మిచ్చాను సుబ్బలక్ష్మికి.

తన అజ్ఞానానికి సిగ్గుపడిపోయింది సుబ్బ లక్ష్మి. యింతకీ ఆ కాఫీలో కలిపింది తెల్లటి పంచదార. నిజంగా షి హేజ్ క్రియేటెడ్ ఎ స్టార్మ్ ఇన్ ఎ టీ కప్.

# వెలుగుబాట

పి. వి. బి. శ్రీరామమూర్తి



అది విశాలంగావున్న అందమైన పార్కు. పార్కులో గుబురులు గుబురులుగా మనోహరంగా వున్న క్రోటన్స్ మొక్కలు. వింత వింత పరిమళాలను వెదజల్లే పూల మొక్కలు మనసును మురుగొలుపుతున్న నైట్‌క్వీన్‌ల సౌరభాలు. ఆకాశంలోకి నిటారుగా పెరిగిపోతున్న అశోకచెట్లు. ఇంకా వెండి వెన్నెల జిలుగు వెలుగులు. వెలుగులో మురళిని రవళిస్తున్నట్లున్న వేణుగాన లోలుడూ, ఆ వేణుగానలోలుని కౌగిలిలో కరిగిపోయే రాధల కమనీయ పాలరాతి విగ్రహం. చెరువలో మెత్తగానున్న పచ్చని పసిరికపై కూర్చున్న కృష్ణవేణి, కృష్ణవేణి కళ్లలోకి చూస్తూ పరవశించిపోతున్న గోపాలం.

''ఏమండీ! ఏమిటలా చూస్తున్నారు?'' ప్రశ్నించింది కృష్ణవేణి.

''మిమ్మల్నే.''

''నాలో ఏం చూడగల్గుతున్నారు?''

''మరులుగొలిపే సౌందర్యాన్ని.''

''ఊహూఁ...సరేలెండి...ఏదో మాటాడ లన్నారుగా మరి?''

''మిమ్మల్ని చూస్తుంటే ఉట్టిమాటలు ఆడాలని లేదు.''

''మరి?''

''కవిత్వం చెప్పాలనిపిస్తోంది!'' అతని మాటలు అర్థంకాలేదు కృష్ణవేణికి. ఏం అనాలో తెలియక ''చెప్పండి అయితే!'' అన్నది.

''ఆ శక్తి నాలో లేకపోవటం చేతనే విచారిస్తున్నాను.''

''ఏ శక్తి?''

''కవిత్వం చెప్పే శక్తి.''

**ప్రారంభం!**

కార్టూన్‌లు పంపేవారు స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరుకూడా పంపడం మంచిది. సం.



## వెలుగు బాట

"మరెలా కవిత్వం చెపుతానంటున్నారు?"

"ఇలాగే మిమ్మల్ని చూస్తూ కూర్చుంటే కవిత్వం దానంతట అదే వచ్చేస్తుంది."

"ఊహుం..." తల దించుకుంది ముభావంగా.

"మీరలా కూర్చుంటే ఎలా వున్నారో చెప్పనా?" గోపాలం అన్నాడు.

కృష్ణవేణి ఘాట్లాడకుండా ఊరుకుంది.

"మీకు బోరుకొట్టించేస్తున్నాను అనుకుంటాను." గోపాలం,

"అబ్బే. లేదండీ. ఏదో ఆలోచిస్తున్నాను" కొంచెం మొహమాటుపడుతూ లంది కృష్ణవేణి.

"మరి మీరు మాటాడకుండా కూర్చుంటే నా కలానే అనిపిస్తోంది."

"అబ్బే...అదేం కాదండి. నాకు పెద్దగా మాటాడే అలవాటు లేదు."

"ఇలాటి ఏకాంత సమయాలలో కూడానా?" ఆ మాటకు నవ్వి వూరుకుంది కృష్ణవేణి.

"మిమ్మల్ని చూస్తుంటే మీ నవ్వుల పాలవెల్లిలో లీనమైపోవాలని ఉంటుంది."

మరోసారి ప్రయత్నించి నవ్వింది కృష్ణవేణి.

"మీ కిష్టం లేకపోతే లేచిపోదాం."

"ఫర్వాలేదులెండి. మీరేదో మాటాడాలన్నారుగా." అతను చెప్పేదేదో ఆసక్తితో వినాలని వుంది కృష్ణవేణికి. అతని మనసులో ఉన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చితే కృష్ణవేణి ఏమంటుందోనని సందేహిస్తున్నాడు గోపాలం.

"నేనో విషయం అడుగుతాను నూటిగా జవాబు చెప్పగలరా?" చెప్పబోయే విషయంలోకి దించుతూ అన్నాడు గోపాలం.

"అడగండి."

"సూటిగా జవాబివ్వగలనంటేనే అడుగుతాను."

"ప్రయత్నిస్తాను, చెప్పగలిగితే."

"అలాగయితే అడగను."

"సరే అడగండి ఆలోచిస్తాను." ఒక్క నిమిషం కృష్ణవేణి కళ్లలోకి చూసాడు గోపాలం. అతని కళ్లలో సందేహంతో కూడుకున్న భయంతో, రంగులు మారిపోతున్న ముఖాన్ని తేరిపార చూసింది కృష్ణవేణి. ప్రక్కనున్న గడ్డిపరకను త్రుంచుతూ.

"నన్ను మీరెలా భావిస్తున్నారు?"

"ఒక బోయ్ ఫ్రెండ్‌గా."

"అంతేనా?"

ఆ ప్రశ్నకు జవాబు చెప్పకుండా వూరుకుంది కృష్ణవేణి.

"నా మీద మరో అభిప్రాయమే లేదా?" మళ్లీ ప్రశ్నించిన గోపీ ముఖంలోకి మరోమారు చూసి, "మీకు నాపై ఎలాటి అభిప్రాయం ఉందో ముందు మీరు చెప్పండి!" గడుసు తనంతో ప్రశ్నించిందామె. కృష్ణవేణి వేసిన ప్రశ్నకి సమాధానం చెప్పలేక తబ్బిబ్బయాడు గోపాలం. కొంతసేపు మౌనంగా వూరుకున్నాడు తరువాత "నేను నా అభిప్రాయాన్ని మీకు సూటిగా చెప్పలేక పోతున్నాను. ఈ కాగితం చదువుకోండి. నేను మీ కర్థమవుతాను." అని జేబులోంచి మడతతో ఉన్న కాగితాన్ని తీసి కృష్ణవేణి కందిచ్చాడు. వణుకుతున్న చేతులతో కాగితాన్ని అందుకొని, హేండ్‌బాగ్‌లో పెట్టుకుంది కృష్ణవేణి.

"ఎనిమిది దాటిపోతోంది, ఇక పోదాం లెండి." అని అక్కణ్ణుంచి లేచింది కృష్ణవేణి. గోపాలం లేచి నిలబడుతూ "నాకు సమాధానం వెంటనే ఇస్తారుగా?" అన్నాడు. ఇద్దరూ పార్కు బయటకు వచ్చాక, కృష్ణవేణికి టాటా చెప్పి, సైకిల్ మీద వెళ్లిపోయాడు గోపాలం. కృష్ణవేణి నడుస్తోంది. తడబడుతున్న అడుగులతో, ఆలోచిస్తున్న మనసుతో, ముసురుకుంటున్న సందేహాలతో.

ఆమె ఆలోచిస్తోంది — అతనిచ్చిన కాగితంలో ఏముందోనని మాత్రం కాదు. దానికి 'జవాబు' ఏమివ్వాలన్నది.

గోపాలం తనకు పరిచయమై ఆరుమాసాలయింది. ఆ పరిచయంకూడా అంత చెప్పుకో దగ్గదికాదు. అయినా అతను కాస్త కలుపుగోలు మనిషిలా కనిపిస్తాడు. ఆలోచిస్తూ ఇల్లు చేరుకుంది కృష్ణవేణి. కాలింగ్ బెల్లు రెండుసార్లు గట్టిగా నొక్కిన తరువాత "వస్తున్నా." అన్న కేక వినిపించింది. తలుపు తెరుస్తూనే కృష్ణవేణిని చూసిన తల్లి. "ఎక్కడున్నావే ఇంతవరకూ? నాన్నగారొచ్చి చాల సేపయింది. నువ్వింతవరకూ ఇంటికి రానందుకు చాలా కోపంగా వున్నారు." అని మెల్లగా గొణిగింది. కృష్ణవేణికి ఆ మాటలు పిడుగు పడినట్లయాయి. తండ్రి కోపంగా ఉన్నారన్నమాట వినేసరికి ముచ్చెమటొప్పిన

ఆలోచనలన్నీ పటాపంచలు అయిపోయాయి కృష్ణవేణికి. ముఖంనిండా చిరుచెమటలు పోసాయి. తలవంచుకుంటూ వెళ్ళిపోబోయింది కృష్ణవేణి.

"కృష్ణా!" తండ్రి పిలుపు వినేసరికి ప్రాణంపోయినంత పనయి ఆగింది. అయినా, ఆ పిలుపులో గంభీరత కనిపించకపోయేసరికి తనను తాను కొంతవరకూ సంబాళించుకుంది.

"ఎప్పుడొచ్చేసారు నాన్నా?"

"ఆఁ... చాలా సేపయిందమ్మా నే నొచ్చి... ఇంతవరకూ ఎక్కడ ఉండిపోయావమ్మా?" చేతిలో పేపరు ప్రక్కన వున్న టేబిలుమీదికి విసురుతూ అడిగారు రామచంద్రరావుగారు. కృష్ణవేణి గుండెలు దడదడా కొట్టుకున్నాయి. ఏం సమాధానం చెప్పాలో తెలియక, "ఇవాళ 'విమల' బర్త్ డే నాన్నా! అందునుంచి ఆలస్యమయిపోయింది. ఎప్పటికీ వదిలిందికాదు. వచ్చేదామనుకున్నా." ఒక మాటకు రెండు మాటలు ఎక్కువగా చెప్పింది కృష్ణవేణి.

"పోనీ, బాగా జరిగిపోయిందా?"

"సక్సెస్‌గా జరిగిపోయింది నాన్నా!" కంగారుగా సమాధానం చెప్పింది.

"అయినా వీలయినంత తొందరగా ఆడపిల్లలు ఇంటికి చేరుకుంటూ ఉండాలమ్మా. రోజులు బాగులేవు. సర్లే వెళ్ళి భోజనం చెయ్. ఇంకెప్పుడూ ఇంత రాత్రయేవరకూ బయట తిరగకు." అనేసి భార్య రాజ్యలక్ష్మి కేసి తిరిగి, "అయినా రాజ్యం! నీకింకా బుద్ధిలేదోయ్. ఆడపిల్ల ఒక్కర్తే వెళ్తోందని తెల్సుకదా, వెనకాల ఎవర్నైనా పంపలేకపోయావా?" రాజ్యలక్ష్మమ్మ సమాధానం చెప్పకుండా వూరుకుంది. కృష్ణవేణికి గుండెలమీదినుంచి పెద్ద బరువును దించుకున్నట్లయి గట్టిగా నిట్టూర్చింది. రామచంద్రరావుగారు ఆ విషయాన్ని అంత తేలికగా విడిచిపెడతారని కృష్ణవేణికాని, ఆ యింట్లో మరెవరు కానీ అనుకోలేదు.

రామచంద్రరావుగారు రిటయిరుడు పోలీస్ ఆఫీసరు. అతని తండ్రి, తాతలందరూకూడా పోలీస్‌శాఖలో పనిచేసినవాళ్ళే. అందరూ స్ట్రిక్ట్ ప్రిన్సిపుల్స్ కలవాళ్ళే. రామచంద్రరావుగారికి అయిదుగురు కొడుకులు ఆపై ఇద్దరు కూతుళ్ళు. అయిదుగురు కొడుకులూ ఫారిన్ వెళ్ళి వచ్చినవారే. అందరూ మంచి హోదాలో ఉన్నవాళ్ళే. కూతుళ్ళిద్దరూ ఆఖరివాళ్ళు. పెద్దకూతురికి బి. ఎస్సీ. అయిన తరువాత ఇంజనీర్‌తో పెళ్ళి చేసారు. ఆఖరి పిల్ల కృష్ణవేణి అంటే రామచంద్రరావుగారికి ప్రాణప్రాణాలు. తన తక్కిన పిల్లలందరికంటే కూడా కృష్ణవేణికి తండ్రి దగ్గర చనువెక్కువ. అయినా కోపంతో రామచంద్రరావుగారు కళ్ళెర్రచేసి చూస్తే కృష్ణవేణి భయంతో కన్నీరు పెట్టుకుంటుంది. అతనికి కోసం వచ్చినపుడు పెద్ద పెద్ద హోదాల్లో వుంటున్న అతని కొడుకులకు సైతం అతని ఎదుట నిల్చి సమాధానం చెప్పటానికి బయపడతారు. అతనంటే కేవలం భయం మాత్రమే కాకుండా దానికి మించిన భక్తి కూడా వుంది—ఆ యింటి కోడళ్ళకు కూడా.

తొందర తొందరగా భోజనం చేసేసి తన గదిలోకి వచ్చి తలుపు గడియపెట్టుకుని పార్కులో గోపాలరావు తన చేతి కందించిన కాగితం విప్పుతున్నప్పుడు చేతుల్లోంచి వస్తుని వణుకు, గుండెల్లోంచి బయం, ఒక ప్రక్కను కలుగుతున్నా, మరో ప్రక్కన మధురమైన కోరికల నును సిగ్గు దొంతరలు ఆమెను పూర్తిగా ఆవరించాయి. కాగితం తెరిచింది.

"ప్రియమైన కృష్ణవేణి గారికి...

నేను మీ కంటె కాస్త చొరవ తీసికుంటున్నందుకు నన్ను క్షమించగలరు కదూ? కొన్ని పరిచయాలు, కొన్ని అనుబంధాలు జీవితంలో మరచిపోలేనివి. మరచిపోరానివీను. మిమ్మల్ని మొదటిసారిగా కలుసుకొని, మీతో మాట్లాడుతున్నపుడు మీ కళ్లలో కనిపించే అందాల హరివిల్లు నన్నెంత ఆకర్షించాయనుకున్నారు? ఆరోజు డిబేట్ కాంపిటీషన్‌లో మీకు మొదటి ప్రైజు, నాకు రెండవ ప్రైజు వచ్చినందుకు మొదటిసారిగా బాధపడ్డాను. అంతవరకూ ఏ పోటీలో పాల్గొన్నా మొదటిగా నేనే ఎన్నికవుతుండటం, ఆ రోజు అలా జరగకపోవటం బహుశః నాలోని బాధకు కారణం అయి వుంటుంది. అయినా, మీ మాటల మకరందంలో మునిగిపోతున్న నాకు సర్వం మరచిపోవాలనిపిస్తూ ఉంటుంది. ఆ రోజు పరిచయం మన మధ్య ఈ రకమైన మైత్రిని పెంపొందిస్తుందని నే ననుకోలేదు. మీతో మాట్లాడటం మహా భాగ్యంగా తలుచుకుంటూ, అందుకోసం శతధా ప్రయత్నిస్తున్న వారందరి కంటె నే నెంత అదృష్టవంతుణ్ణి? 'మీ మాట వింటుంటే ఎంత హాయిగా వుంటుంది?' అని మీ రంటున్నప్పుడు నాలో నేను ఎంత పరవశించిపోతానో తెలుసా? జీవితాంతం నా వెంట మీరలా అంటూ కూర్చునే అదృష్టం నాకు కలిగించమని నే నెప్పుడూ కోరుకుంటున్నాను. నా కలలు ఇలలో నిజమైన రోజు వస్తే నాకింకేం కావాలి? మిమ్మల్ని చూస్తుంటే, మీ మాటలు వింటూంటే మీపై కవిత్వం వ్రాయాలనీ, మీ కమనీయ స్వరూపం శిల్పంగా మలచాలనీ, కదిలి విచ్చిన మల్లిక లాంటి మీ ఆకారాన్ని, అవయవాలొప్పిన అద్భుతంలాటి మీ సౌందర్యాన్ని చూస్తుంటే చిత్రంగా రూపొందించే చిత్రకారుణ్ణి కావాలని అనిపిస్తుంటుంది! కాని — ఆ శక్తులు ఆ భగవంతుడు నాకు ప్రసాదించకపోవటం

(32వ పేజీ చూడండి)



సుబ్బలక్ష్మి కళ్లు టప టపా ఆర్పి చూసింది. ఎత్తయిన బుగ్గలమీద ఎగురుతున్న కురులను ప్రక్కకు సర్దుకుని మళ్ళీ చూసింది.

# వలవేస



సత్యం మందపాటి

అతను ఎర్రగా, పొడుగ్గా, హుందాగా వున్నాడు, మెల్లగా నడిచి వస్తున్నాడు.

* * *

అప్పారావ్ కళ్ళెత్తి సుబ్బలక్ష్మిని సూటిగా చూశాడు. ఆమె కనురెప్పలు సిగ్గుతో క్రిందకు వాలిపోయాయి. అప్పారావ్ నడుస్తూనే ఆమెను కళ్లతో త్రాగేస్తున్నాడు. అరచేయి అంత విశాలమైన కళ్ళు. కళ్ళమధ్య నుంచి క్రిందకు సూదంటు రాయిలా ముక్కు. ఇంకా కొంచెం క్రింద మెరుస్తున్న పెదవులు.

వెనక కారు హారన్ మ్రోగడంతో ఉలిక్కిపడి రోడ్డు ప్రక్కకు తప్పుకుని, చక చకా నడవసాగాడు అప్పారావ్.

* * *

అతను వెళ్ళిపోతున్నాడు.

తనను దాటేశాడు.

సుబ్బలక్ష్మి ఆత్రంగా అతన్ని చూస్తున్నది.

అతను వెళ్ళిపోతున్నాడు.

వెనక్కి తిరిగి మళ్ళీ అతను చూస్తాడా ?

చూశాడంటే అతను, అతను, తన ఉనికిని గుర్తించినట్టే.

ఇంతకూ అసలు చూస్తాడా ?

సస్పెన్సు.

సుబ్బలక్ష్మి ఆత్రంగా చూస్తున్నది.

అతని విశాలమైన భుజాల మీద వున్న తల మెల్లగా ప్రక్కకు తిరిగింది.

అతను ఆగాడు.

వెనక్కి తిరిగాడు.

అమ్మయ్యా — చూసేశాడు.

అతను వెనక్కి తిరిగి చూశాడు.

సుబ్బలక్ష్మికి మహదానందమయింది.

* * *

అరె — ఆమె కూడా తననే చూస్తున్నది.

అప్పారావ్ కొంచెం కంగారుపడ్డాడు.

తను చూడాలని, ఆమె చూస్తున్నది —

అంటే తనని ఆమె గుర్తించిందన్నమాట.

హాయ్ — స్వీట్ —

అప్పారావ్ సన్నగా నవ్వాడు.

ఆమెకు కనపడేట్టుగా —

ఆమె హృదయాన్ని తాకేట్టుగా —

ఆమె మనసులో కలకాలం యింకిపోయేలా—

* * *

అయ్యో—అతను తనని చూసి నవ్వేశాడు

సుబ్బలక్ష్మి హృదయం సముద్ర కెరటంలా ఉవ్వెత్తున ఎగిరి పడింది.

# వారఫలం

—మహేష్—

9-4-1976 శుక్రవారం మొదలు
15-4-1976 గురువారం వరకు

మేషం — మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి సాటివారిలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో ఇత రుల నిమిత్తం శ్రమకు గురికాగలరు స్త్రీలకు—దైవకార్యాలు నెరవేరతాయి సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

వృషభం — వృత్తిలో అనుకూలవార్తలను వింటారు మిత్రులకు సహాయం చేస్తారు ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి ముస్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధి స్తారు స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

మిథునం — మీ శ్రమకు తగిన ఫలితం లభి స్తుంది రావలసిన డబ్బు అందుతుంది రాజ కీయ వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో సాటివారి పోటీ తగ్గుతుంది మీ మంచి తనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది స్త్రీలకు-బంధు త్రులను కల్సుకొంటారు పుణ్య కార్యాలు చేస్తారు.

కర్కాటకం— వృత్తివ్యాపారాలు బాగుంటాయి ప్రయాణాలోచనలు చేస్తారు ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది సాహసిక వ్యవ హారాలు, లాభించగలవు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది శుభకార్యాల విషయంలో అను కూలత లభిస్తుంది.

సింహం :— మీ ప్రయత్నాలకు ఆటంకాలొ వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారంమధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

కన్య — వ్యాపారంలో ఆదాయం పెరుగు తుంది సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం మధ్యలో శ్రమపొందవలసివస్తుంది వృత్తిలో ఎవ రినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖ

---

ఎడంచేతిని గుండెలమీద వేసుకుని, కుడి చేతిని పైకెత్తి సుతారంగా అట్లూ, యిట్లూ వూపింది.

సాధ్యమైనంత అందంగా చిరునవ్వింది.

*    *    *

గాడ్ — చేయి వూపింది.

ఆ అమ్మాయి చేయి వూపేసింది.

అప్పారావ్ హృదయం ఒక క్షణం ''లబ్—డబ్'' అనటం మానేసింది

మానేసి వూరుకోక అప్పారావ్ మనసుని గిలిగింతలు పెట్టింది.

అప్పారావ్ కూడా చేయి పైకెత్తాడు చేయి సున్నితంగా అటూ యిటూ వూపాడు ''హాయ్'' అందామనుకుని వూరుకున్నాడు.

*    *    *

''అబ్బ — ఎంత హాయిగా వున్నాడు'' అనుకుంది సుబ్బలక్ష్మి

''అవును—ఎంత హాయిగా వుంది'' అను కున్నాడు అప్పారావ్

*    *    *

నాన్న పెళ్లి చేయడు.

చేయలేడు

రెండేళ్ల నుంచీ జీతాలివ్వని స్కూల్లో, ముప్ఫయి ఏళ్ల నుంచీ పని చేస్తున్నాడు నాన్న

సుబ్బలక్ష్మి ఉబ్బిన, ఎర్రటి మున్నటి బుగ్గల మీద అరిచేతులు ఆనించి ఆలో చిస్తున్నది.

ఎంతోమంది పిల్లల్ని ధైర్యంగా కనగలిగిన నాన్న (అంటే సుబ్బలక్ష్మి నాన్నే పిల్లల్ని కన్నాడని కాదు) — వాళ్లను పెంచటానికి భయపడుతున్నాడు.

భయపడి, పడి యిప్పుడు మంచాన పడ్డాడు.

మిగతా అందరూ నానా అవస్థలూ పడుతున్నారు

అందుకే సుబ్బలక్ష్మి ఆలోచిస్తున్నది.

తను పుట్టి ఇరవైఏడు ఏళ్లు అయింది.

రోజా గులాబీలు పూస్తున్నాయి.

మల్లెలు గుబాళిస్తున్నాయి

చందమామ వెన్నెల విరజిమ్ముతున్నాడు.

అందుకే సుబ్బలక్ష్మి ఆలోచిస్తున్నది

కట్నం ఖర్చు, పెళ్లి ఖర్చు తప్పుతాయి

క్కుర్రోడు, ఎర్రగా, బుర్రగా, పున్నోడి లానే వున్నాడు

దానికి తోడు తనని చూసి చల్లగా నవ్వాడు కూడాను

ఈ దెబ్బలో నాన్న కన్నెటి కష్టాలూ, తన ఏయటి బాధ రెండు ఏరలాయి

అందుకే సుబ్బలక్ష్మి ఆలోచిస్తున్నది.

*    *    *

తనకి ఉద్యోగం రాదు

వచ్చే అవకాశాలూ లేవు

డిగ్రీ చదువు, మూడేళ్లు పట్టినా, చదువు పూర్తయి ఆరేళ్లయింది

అప్పారావ్ దుబ్బుగా పెరిగిన క్రాఫ్‌లో, తన పొడపైన చేలివేళ్లు వుంచి ఆలోచిస్తున్నాడు

ఏదో నాలుగురాళ్లు సంపాదిస్తాడని (నిజంగా యిప్పుడలాగే వుంది అతని పరిస్థితి) వాళ్లనాన్న, వున్న అయిదెకరాలూ తెగనమ్మి అప్పారావ్‌ను చదివించాడు

చదివించాడు కానీ ఉద్యోగం యిప్పించలేక పోయాడు.

అంతేకాదు ఈ లోకం వదలి అదే పోత పోయాడు.

మిగతా అందరూ తన మీద పడి ఆకలి అరుపులు అరుస్తున్నారు.

అందుకే అప్పారావ్ ఆలోచిస్తున్నాడు.

తను పుట్టి ముప్ఫయి ఏళ్లు దాటింది.

రోజా పిల్లగాలి తనను గిలిగింతలు పెడు తున్నది

ఆడపిల్లల కళ్లు కవ్విస్తున్నాయి.

నరాలు నమిలేస్తున్నాయి.

అందుకే అప్పారావ్ ఆలోచిస్తున్నాడు.

తన సరదా, సరసం తీరతాయి

పిల్ల కూడా బొద్దుగా, కవ్వింపుగా వుంది.

దానికితోడు తనని చూసి చిరునవ్వు నవ్వింది కూడాను.

ఈ దెబ్బతో తన శరీర బాధా, మనసు లోని ఆలోచనలూ తగ్గుతాయి

అందుకే అప్పారావ్ ఆలోచిస్తున్నాడు.

*    *    *

ఎర, చేపనుచూసి ''ఇదోవెర్రిమాలోకం'' అనుకుంటుంది

''తనని తినటానికి వచ్చి, గాలానికి తగులు కుంటుంది. ఒక ఆలోచనా లేదు, పాడూ లేదూ'' అనుకుంటుంది ఎర

చేప ఎరను చూసి ''ఇదో పిచ్చి మాలో కం'' అనుకుంటుంది

''కదలకుండా గాలానికి తగులుకుని, నావేపే చూస్తున్నది. దీన్ని తినేసి కడుపు నింపుకోవాలి'' అనుకుంటుంది చేప

అప్పారావ్‌ని అలా హాకగా చూసి హరి విల్లులా నవ్వింది సుబ్బలక్ష్మి

సుబ్బలక్ష్మిని వాడిగా చూసి వేడిగా నవ్వాడు అప్పారావ్,

# వారఫలం

రులో అనుకూల పరిస్థితి ఏర్పడగలదు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. ఇతరుల వివాదాలను తెల్పుకొంటారు

తుల — ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది వారం ఆఖరులో మీ తొందరపాటుకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు స్త్రీలకు— దైవ కార్యాలు నెరవేరతాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది.

వృశ్చికం — ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది సాహసిక వ్యవహారాలు లాభించగలవు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు

ధనుస్సు — మీరు శ్రమపడినా, ఫలితం దక్కదు సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— అనవసరమైన వ్యయం చేస్తారు. బంధుమిత్రులను కల్పుకొంటారు

మకరం — రావలసిన డబ్బు అందుతుంది సాటివారిలో గౌరవం లభిస్తుంది వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది లాభంరావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు ప్రయాణాలో లోచనలు చేస్తారు

కుంభం :— సాటివారితో వాదప్రతివాదాలు తగవు ప్రయాణాలు వాయిదా పడతాయి వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్పుకొంటారు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

మీనం :— వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి ●

గోద్రెజ్ నుండి

# క్రొత్త టర్కిష్ బాత్




## ఒక ఉన్నతమైన సబ్బు నమ్మలేని ధరలో కేవలం

# Re.1·00 (పన్నులు అదనం)

గోద్రెజ్ వారు మాత్రమే మీకు అంత తక్కువ ధరలో ఎక్కువ నురుగు నిచ్చే...ఎక్కువ నిలువ ఉండే...తాజాదనము నిచ్చె సువాసనతో ఉండే సబ్బును అంద చేయగలరు.

**గోద్రెజ్ వారి టర్కిష్ బాత్**

Interpub/GTB.1/75/TEL.




పాలు తోడువేసిన తర్వాత 'పెరుగు అవుతున్నది ఆ పెరుగును కవ్వంలో చిలికితే వెన్న వస్తుంది. ఆ వెన్నను వేరుచేస్తే మజ్జిగ తయారవుతుంది. చిలికిన తర్వాత వెన్నను వేరుగా తీసి ఒక పాత్రలో ఉంచాలి లేదా మంచినీళ్ళు పోసి వున్న పాత్రలోనయినా ఉంచుతారు అలా కాక, ఆ వెన్నముద్దను ఆ మజ్జిగనీళ్ళన్న ఆ పాత్రలోనే ఉంచివేసినట్లయితే దాని మాధుర్యం పోతుంది కరిగిపోతుంది కూడా

వెన్న తియ్యాలంటే దానికి ప్రశాంత సమయం, ప్రశాంత వాతావరణ కావాలి తెల్లవారుజామున ప్రకృతి యింకా నిద్రాణమయి ఉంటున్నందున ప్రశాంతత ఉంటుంది కాబట్టి అప్పుడే దధిమథనం జరుగుతుంది పగటివేళలలో ఆ పనికి సిద్ధపడరు అప్పుడు ప్రశాంతత ఉండదు

జ్ఞాన విషయంలో దీనిని దృష్టాంతంగా తీసుకొనవచ్చును.

మనం ఆత్మ తత్వాన్ని అవగాహన చేసుకొనడానికి ప్రయత్నించాలంటే ప్రశాంతమైన సమయం, ఏకాంతమైన స్థలం ఉండాలి పెరుగును చాలాసేపు మథిస్తేనేగాని వెన్న రానట్లు నిశ్చలమైన మనస్సుతో ఎంతోకాలం సాధన చేస్తేనేగాని ఆత్మజ్ఞానం కలగదు ఆ జ్ఞానం కలిగిన తర్వాత ఇతర ప్రజలకు దూరంగా ఉండాలి. ఇంద్రియ విషయాలకు లోబడకూడదు లోబడినట్లయితే సంపాదించుకున్న జ్ఞానం కాస్తా అంతరించి పోతుంది. కలిస్తే, ఆత్మజ్ఞులైనవారితో కలిసి వుంటే వుండవచ్చును అదీ కొంచెం కాలమే ఎవ్వరితోన్నూ చేరకుండా దూరంగా ఉండటం మరీ మంచిది అలా ఉన్నప్పుడే సంపాదించిన ఆత్మజ్ఞానం నిలుస్తుంది సాధన చేస్తే వ్యక్తి మనస్సు పెరుగువంటిది సాధనచేసే వ్యక్తి ఆ దధిని మథించే పడతివంటివాడు ఇలా సాధనవల్ల సాదించిన జ్ఞానమే నవనీతం వంటిది వెన్నఉంచే మంచినీళ్ళు జ్ఞానుల వంటివారు

ఆ వెన్నను ప్రత్యేకంగా ఉంచకుండా మజ్జిగనీళ్లలోనే ఉంచినపక్షాన—ఆ మజ్జిగనీళ్ళు లౌకికవిషయాలవంటివి ఆత్మజ్ఞులు వాటికి లొంగిపోతే వారి జ్ఞానం కరిగి, నామరూపాలు లేకుండా పోతుంది.

ఒకసారి జ్ఞానం సంపాదిస్తే దానితో తృప్తిపడి 'మనకేమి?' అనే ధీమాతో ఉండకూడదు అలా ఉంటే – లౌకిక విషయాలు ఆకర్షిస్తూ ఉండటంవల్ల వాటి దోషం – మాలిన్యం అంటుకుని జ్ఞానం జ్యోతిర్విహీనమయి క్రమక్రమంగా హరించిపోతుంది

అందువల్లనే అంటకుండా వాటికి చాలా దూరంగా ఉండాలి

జ్ఞానులయిన యోగులు ప్రశాంత వాతావరణమూ, నిర్మానుష్యస్థలాన్నీ . కోరడానికి కారణం యిదే!

## హైదరాబాద్ నోట్ బుక్

### భవభూతి దినోత్సవం

ఏటా కాళిదాస దినోత్సవమే జరిపే సురభారతీ సమితి మార్చి 7 వ తేదీన ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో భవభూతి దినోత్సవం జరపడం ఆదర్శప్రాయమైంది సమితి కార్యదర్శి డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడు సంస్కృత సాహిత్యంలో దీపస్తంభాలైన మహాకవుల జయంతులు జరుపదలచామన్నారు అధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి భవభూతి రచనలను పరిచయం చేస్తూ ఆయన పేరుకూ తమ పేరుకూ పోటీ ౹౹దన్నారు పిల్లలు పలువురు నష్టమైన తరువాత నాకు కుప్పుస్వామి అని పేరు పెట్టారు భవభూతి అంటే ఈశ్వరుని ౹౹౹౹ద భవభూతికి నాలాగే బూడిద అని పేరు వచ్చి ఉంటుంది" అని చవుత్కరించారు ౹స్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ ఆచార్య కుమారి నళినీసరాడ్కర్ సంస్కృతంలో ప్రసంగిస్తూ కాళిదాస భవభూతుల పాత్రల తులనాత్మక పరిశీలన చేశారు మధ్య రైల్వే ఆర్థిక సలహాదారు శ్రీ ఎ వి సుబ్రహ్మణ్యం ఆంగ్లంలో ప్రసంగిస్తూ, భవభూతి గొప్ప మనస్తత్వవేత్త అని మాలతీమాధవ, మహావీరచరిత ఉత్తరరామచరితాల నుంచి పెక్కు ఉదాహరణలిచ్చారు శ్రీ రావూరి వెంకటేశ్వర్లు తెలుగులో ప్రసంగిస్తూ భవభూతి ధర్మనిష్ఠను వివరించారు

ఈ సందర్భంలోనే సుర౹ తి సమితి స్థాపకాధ్యక్షుడు, ప్రస్తుత ఉపాధ్యక్షుడు ౹౹ కప్పగంతుల లక్ష్మణ శాస్త్రికి కాశీ సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయం సమ్మాన్య ప్రాధ్యాపక పదవిలో (ఎమెరిటస్ ప్రొఫెసర్‌గా) నియమించినందుకు ఆయనను సురభారతీ సమితి సన్మానించింది శ్రీ తిరుమల రామచంద్ర శ్రీ లక్ష్మణశాస్త్రి వివిధ భాషా పాండిత్యాన్ని గురించి సంభాషణ చాతుర్యం, శాస్త్ర విద్వత్తు, బహుభాషలలో వక్తృత్వం, సంస్కృత కవితా చాతుర్యం, విక్రమాంకదేవ చరితానువాద ప్రావీణ్యం, మొదలైన విషయాలను గురించి ప్రసంగించారు

పిదప భవభూతి రచనలలోని కొన్నిఘట్టాలను కుమారి ఎస్ ఛాయాదేవి గానం చేయగా, దాని ఆంగ్లానువాదాన్ని శ్రీ రామారావు చదివారు సురభారతీ సమితి నిర్వహించే కాచిగూడ సంస్కృత తరగతుల విద్యార్థినులు శిశుపాల వధలోని శ్లోకాలను అంత్యాక్షరి పద్ధతిలో చదివారు నిజాం కళాశాల సంస్కృత ఆచార్యులు శ్రీ రవ్వ శ్రీహరి వందన సమర్పణతో సభ సమాప్తమైంది శ్రోత






గోధుమ రంగు నేలపైన కుంకం చిలికిన కమలపు ముగ్గూ,
ఎర్రగన్నేరు పూలదండ లాంటి పెంకులపై నర్తించే నల్లని
కొబ్బరి ఆకులనీడా,
నిండు ముత్తయిదువులా పచ్చని గడపా
చావిడిలో చందనం లాంటి నల్లటేకు బల్లపైన
పొద్దుతిరుగుడు పూల తివాసీ,
నీలి మండువాలో ధవళ నిర్మలమైన పూజామందిరం.
ఆకుపచ్చని సెలయేటిలా కదిలే పూసల పరదా,
జేగూరు వంటింట్లో శుభ్రంగా మెరిసే ఇత్తడి గిన్నెలూ,
పచ్చని తులసికోటా, పక్కనే జీవమొలికే ఆకుపచ్చని
అరటి చెట్లకు, బంగారంలా వేలాడే కర్పూరపు
చక్కెరకేళీ గెలలూ,
పెరడు ఒక నందనవనం

అంతా రంగుమయం






**నెరొలాక్**

రంగు మన జీవితంలో ఒక సమగ్రమైన భాగం—నెరొలాక్

U CNA 19

విశ్వం మాటలు నచ్చకో ఏమో — మరొక్క క్షణం కూడా అక్కడ వుండలేక ఇవతలకు వచ్చేసింది సుమ

సుమ అటు వెళ్ళటంతోటే ఇటు సుబ్బ రామయ్య వచ్చాడు అక్కడికి ఆ రోజు సెకండు సాటర్‌డే శలవు అప్పటివరకు ఏవో ఆఫీసు కాగితాలు చూసుకొంటూ తన గదిలోనే ఉండి పోయాడు అతడు

సుబ్బరామయ్యను చూడటంతోటే వినయంగా లేచి నిలబడ్డాడు విశ్వం

"విశ్వం! చాలాసేపుగా ఈ గదిలో జరిగే మాటలు నేను వింటూనే ఉన్నాను ఇక ముందూ నువ్వు సుజాతతో అదే విధంగా మాట్లాడాలి ఇంతవరకూ తనకు భవిష్యత్తే లేదని మానసికంగా కృంగిపోతున్న అది నీ మాటలు విని జీవనానురక్తి పెంచుకుంటుందన్నది నా ఆశ ఇందాక నువ్ మాట్లాడావ్ చూడు — వాట్నిగురించి ఆలోచించక పోదు సుమ అదికూడా సుజాత విషయంలో తన వెనుకటి విధానం మార్చుకోవచ్చు ఒక విధంగా నువ్వు మా కుటుంబానికి ఎంతో మేలు చేస్తున్నావ్ నీకు ఎలా కృతజ్ఞత చెప్పకోవాలో తెలియటంలేదు విశ్వం" అన్నాడు సుబ్బరామయ్య

ఆ మాటలకు పొంగిపోక సిగ్గుపడ్డాడు విశ్వం

"సుజాతతో, సుమతో అలా అన్నాను అంటే— అది మానవ సహజమండీ కానీ, మీరు మాత్రం నాకు మహోపకారం చేస్తున్నారు, సర్! నేను అట్టడుగు కుటుంబంలో పుట్టాను చదివే చదువు ఆగిపోయి, బ్రతుకుతెరువు లేక జీవితమే అంధకార మయమై అలమటిస్తున్న నన్ను మీరు వెలుగు ప్రపంచంలోకి తీసుకువచ్చారు నాలో జీవితాశను రేకెత్తించారు నేను ఈనాడు ఇంత చొరవగా మాట్లాడుతున్నానంటే — అది నా అదృష్టంగా భావించుకుంటున్నానండీ"

విశ్వం ఒక రచయిత కాబట్టి అతడి మాటలు ఛందోబద్ధంగా లేకపోయినా భావయుక్తంగా ఉంటాయి భాష కూడా బావుంటుంది

ఆ తర్వాత సుబ్బరామయ్య అతడి చదువు విషయాలు అడిగాడు సంతృప్తికరంగానే సమాధానం చెప్పాడు విశ్వం

సాయంత్రం అయిదు గంటల ప్రాంతంలో చేతిలో పుస్తకాలు పట్టుకొని ట్యూటరు ఇంటికని బయులుదేరాడు విశ్వం ఆ రోజు

"మీతోపాటు నేనూ అందాకా వస్తాను బావ గారూ!" అంది సుమ లోపలినుంచి వచ్చి

వాళ్ళ ఇంట్లో ఉంటున్నాడు కనుక ఆమె మాట్లాడిస్తే మాట్లాడక తప్పదు అయితే తనతో కలిసి బజార్లో తిరిగే చొరవ సుమకు ఇవ్వకూడదన్నది విశ్వం అభిప్రాయం ఇందువల్ల ఎవరిలో ఎటువంటి అనుమానాలు బయలుదేరతాయో, ఎవరి మనసు ఏ విధంగా బాధ పడుతుందో — చివరకు ఆమే తనమీద లేనిపోని ఆశలు కల్పించుకోవటానికి అవకాశం ఉంటుందన్నది అతడి భయం

"నువ్వెక్కడికి సుమా?"

"మీరు వెళ్లే ఆ ట్యూటరు ఇంటికి కాదు

# కాలమిచ్చిన తీర్పు

## 'అన్నపూర్ణ'

*(గత సంచిక తరువాయి)*

లెండి నా స్నేహితురాలు కళ్యాణింటికి వెళ్లే దారిలోనే వాళ్ళ ఇల్లు చూపిస్తాను వచ్చేటప్పుడు మీరూ అక్కడికి రండి ఇద్దరం కలిసి వచ్చేద్దాం ఓ కే?"

"ఓ కె గాని, మీ అమ్మగారి పర్మిషన్ తీసుకున్నావా మరి?"

"ఇటువంటి చిన్న చిన్న విషయాలకు నాకు ఎవరి పర్మిషన్‌లు అక్కరలేదు స్నేహితురాలి ఇంటికి వెళ్లానంటే మా ఫాదర్, మదర్ ఏమీ అనరు"

ఇద్దరూ కలిసి బయటికి వచ్చారు రోడ్డు మీద ప్రక్క ప్రక్కగానే నడుస్తున్నా ఎవరి గొంతు పెగలటంలేదు అదేం చిత్రమో — ఇంటి దగ్గర ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకోవటానికి కావలసినన్ని మాటలు దొరికేవి పైగా భిడియమే ఉండేది కాదు మరి బజార్లో — నలుగురి మధ్య పెదవి విప్పటానికే అభిమానపడుతున్నారు వాళ్ళు

కొంత దూరం అలాగే వెళ్లాక రమేష్ ఎదురైయ్యాడు

అతణ్ణి చూసి ఆశ్చర్యపడ్డారు ఇద్దరూ 'బావ బజార్లు పట్టుకొని తిరుగుతున్నాడు మరి ఆ బుక్‌స్టాల్ ఏమైనట్లు?' అనుకొని ఆ మాటే పైకి అడిగేసింది సుమ

విశ్వం, సుమ — ఆ ఇద్దర్నీ కలిపి చూశాక రమేష్ మెదడు పని చేయటం మానేసినట్లయింది లోగడకూడా ఇలాంటి — మరో సంఘటన అతని

**జరిగిన కథ :** సుబ్బరామయ్య సుందరిల సంతానం సుజాత, సుమ, సుధాకర్‌లు సుజాత అనాకారితనాన్ని ఏవగించుకునే సుమ, మెడిసన్ చదవాలని పట్టుబట్టే సుధాకర్‌ల వల్ల కలత చెందుతాడు సుబ్బరామయ్య తన అల్లుడికి వుద్యోగం ఇప్పించమని బాల్యమిత్రుడు రామనాథం సుబ్బరామయ్యని కోర్తాడు సుబ్బ రామయ్య చెల్లెలు సీత కొడుకు రమేష్ దుర్వ్యసనాల పాలవుతాడు రమేష్ వ్యాపారానికి కావలసిన అప్పిప్పించటానికి అంగీకరిస్తాడు సుబ్బరామయ్య ఆ యింట్లో రామనాథంచే వదలబడ్డ అనాథ విశ్వం, తన మాట నేర్పుతో అందరికి చేరువ అవుతాడు

కళ్ళబడింది 'తను మామయ్య వాళ్ళ ఇంటికి వెళ్లే సరికి వరండా గదిలో — వీళ్లిద్దరే పెద్దగా మాట్లాడుకొంటూ, మధ్య మధ్య పిచ్చిగా నవ్వుతున్నారు ఏమిటి వీళ్ళ ఆ చొరవకు అర్థం?' దీనిమీద రకరకాలుగా ఊహించుకొంటూనే పైకి తప్పదన్నట్లు మాట్లాడాడు

"మామయ్యతో పని ఉండి మీ ఇంటికే వస్తున్నాను. ఇంతకూ మీ నాన్న ఇంటికి వచ్చాడా లేదా?" అనడిగాడు

"ఇంకా రాలేదు" మామూలుగానే జవాబు చెప్పింది సుమ

"అహా సరేగాని, విశ్వంగారిని తీసుకొని బయలుదేరావ్! ఎందాక?" మనసులో మాటను పట్టలేక అడిగేశాడు రమేష్

"సినిమాకు" — అతణ్ణి ఉడికించటానికనే అంది సుమ

ఆమె మాటలు నచ్చనట్లు ముఖం పెట్టాడు విశ్వం

రమేష్ ముఖంలో ఒకదాని వెంట ఒకటి — అనేక రంగులు మారిపోవటం మొదలుపెట్టాయి

"మామయ్య ఇంటికి రాలేదన్నావుగా? నేనూ మీతోపాటు సెంటరుదాకా వస్తాను పదండి" — వెనక్కు తిరిగాడు రమేష్

ముగ్గురూ నడుస్తూనే ఉన్నారు

"మాతోపాటు నువ్వూ వస్తావా బావా, సినిమాకు" -- వచ్చే నవ్వును పెదవుల మధ్య బిగ పట్టుకొని అడిగింది సుమ

"మీరంటే స్వేచ్ఛాజీవులు ఏం చేసినా మీ పెద్దలు ఊరుకొంటారు మరి నాకు కొన్ని బాదర బందీలు ఏడిసినయ్యిగా?"

"అవును పాపం విశ్వం బావగారూ! మా రమేష్ బావకు ఎన్ని బాదర బందీ లనుకున్నారు! అటు పుస్తకాల షాపు — ఇటు గంపెడు సంసారం రెండింటినీ ఒక్కడే ఈదుకు రావాలి! అతడు స్వేచ్ఛగా తిరిగితే మా అత్తయ్య ఊరుకోదు ఆవిడంటే బావకు ఎంత భయమనుకున్నారు! వాళ్ళ అమ్మ అక్కడ కనిపిస్తే సరి ఇక్కడ ఇతని కాళ్ళు గజగజ వణికిపోతయ్యంటే నమ్మండి" -

ఇక వచ్చే నవ్వును ఆపుకోలేకపోయింది సుమ

ఆమె నవ్వు రేగిన పుండుమీద ఉప్పు కారం చల్లిన అనుభూతి కలిగించింది రమేష్‌కు అయినా విశ్వం కూడా సన్నగా నవ్వేసరికి అతనికి వృతి కలిపి ఊరుకున్నాడు

సెంటరు వచ్చేసింది

"నిజంగా మీరు సినిమాకేనా?" అనుమానం తీరక అడిగాడు రమేష్

"శుభ్రంగానూ!" అంది సుమ

శ్రుతి మించకముందే ఏది రాణించినా — ఈ తత్వం కల మనిషి విశ్వం కాబట్టే ఇక ఉండబట్టలేక నిజం చెప్పేశాడు

"పిక్చర్‌కు కాదు నేను ట్యూటరు ఇంటికి వెళ్తున్నానండీ" తనవరకు చెప్పకున్నాడు

"నేను నా స్నేహితురాలింటికని బయలు దేరాను" రమేష్ అడగకముందే చెప్పేసింది సుమ

వాళ్ళిద్దరి మాటలు విన్నాక రమేష్ ముఖం

కొంచెం తేటస పడ్డట్లు కనిపించసాగింది

"సరే వెళ్ళిరండి" అంటూ ఆ యిద్దర్నీ ఎదిలి తన షాపువైపు వెళ్లాడు అతడు

మరికొద్దిదూరం పోయాక,

"బావగారూ! ఎదురుగా కనిపిస్తోందే ఆ పచ్చమేడ — అదే కళ్యాణి ఇల్లు వీలుంటే వచ్చే టప్పుడు అక్కడికి రండి ఇద్దరం కలిసి వద్దాం లేకపోయినా పెద్ద ఇబ్బంది లేదనుకోండి ఇక్కడికి వచ్చిపోతూండటం నాకు అలవాటే" అంటూ ఆ మేడవైపు వెళ్లింది సుమ

సగం బాధ వదిలినట్లైంది విశ్వానికి

ట్యూటరు చక్రధరరావు యింటినుంచి వచ్చే టప్పుడు అతడికి బోసు బొమ్మ దగ్గర కృష్ణ కనిపించాడు

కృష్ణకు, విశ్వానికి పరిచయంతోపాటు స్నేహమూ వుంది ఒకరినొకరు పేరుపెట్టి పిలుచు కుంటారు

"ఎలావుంది కృష్ణా ఉద్యోగం ?"

"బాగానే వుంది మా ఆఫీసరు — అదే నీ కాబోయే మామగారు చాలా మంచివాడోయ్ విశ్వం





"నువ్వు కనిపించి వారం దాటిందికదూ?"

"అవును నేనంటే వుద్యోగంలో వుండి తీరిక లేక నీ దగ్గరికి రావటంలేదనుకో నువ్వు ఖాళీగా వుండికూడా మా యింటివైపు రావటంలేదు"

"ఏం రాను ? అసలు నేనుమాత్రం అక్కడ ఖాళీగా వుంటున్నానా ? అబ్బ, ఒకళ్ళ విడిస్తే ఒకళ్లు — కబుర్లతో కాలక్షేపం చేయలేక చస్తున్నాననుకో"

"అటువంటి యింట్లో ఆశ్రయం దొరకటం నిజంగా నీ అదృష్టం"

"రామనాథం మాష్టారిలాంటి మామగారు, నాగలక్ష్మిలాంటి ప్రేమించే భార్య దొరకటం నీకు మాత్రం అదృష్టంకాదూ ?"

"సరేగాని, లక్ష్మి నిన్ను రోజూ అడుగుతోంది ఈ వేళయినా మా యింటికి వెళ్దాం రా"

కృష్ణ ఆ మాట అనగానే కాదనకుండానే 'సరే' అనేశాడు విశ్వం కృష్ణకు ఆ వూళ్లోనే ఒక పినతల్లి వుంది వాళ్ళింటిప్రక్క ఒక చిన్న గది అద్దెకు తీసుకొని అందులో కాపురం వుంటున్నాడు, అతను

## 9

అప్పుడు దాదాపు రాత్రి పదకొండు గంటలై యుంటుంది

తన ఇంటి తలుపులు ఎవరో తడుతున్న శబ్దం విని రమేష్ లేచాడు సీతమ్మ చల్లగాలికి తట్టుకో లేక లోపల పడుకొంది అంతకుముందే అటు తిరిగి — యిటుతిరిగి వచ్చాడు కనుక ఇంకా మెలకువ లోనే వున్నాడు అతడు వరండాలో కుర్చీవేసుకు కూర్చొని ఏమో ఆలోచిస్తున్నాడు

అతడి ఆలోచనల్లో చోటుచేసుకున్న వ్యక్తులు సుమ, విశ్వం, సుజాతలు మామయ్య ఏమో ఆశపడుతున్నాడుకానీ ఆ విశ్వం సుజాతను చస్తే చేసుకోడు ఏవో ఆదర్శాలనీ అవనీ నటిస్తున్నాడు అలా ఆమెనే చేసుకుంటానని తప్పితే అతడి మనసంతా సుమమీదే వుంది మరి పగలు చూస్తే రాత్రి కల్లోకివచ్చే రూపం సుజాతది చిదిపి దీపం పెట్టుకొనే అందం సుమది

సుమను తను చేసుకోవాలనుకున్నాడు కానీ, ఆమెకు కల్లబొల్లి కబుర్లు చెబుతూ తనవైపుకు తిప్పుకుంటున్నాడు విశ్వం కానీ, వాళ్లిద్దరూ అలా చనువుగా వుండటానికి వీలులేదు విశ్వానికి ఏదో రకంగా బుద్ధిచెప్పితీరాలి ఎలా ? యిదే అతడి చిక్కు సమస్య

ఒకపక్క ఆలోచనల్లోపడి కొట్టుకుంటున్నా, మరోపక్క తప్పదన్నట్లే వెళ్లి తలుపులు తీశాడు

చూస్తే — ఎదురుగా సుధాకర్ !

అతడి ఆ హఠాత్ ఆగమనానికి రమేష్ కాస్త కూస్తా కాదు — ఎంతో ఆశ్చర్యపోయాడు !

సుధాకర్ త్వరత్వరగా లోపలికివచ్చి "తలుపులు వేసెయ్ బావా" అన్నాడు

అలాగే తలుపులు మూసి సుధాకర్‌ను అనుస రించాడు రమేష్

"ఈపూటకు మీ యింట్లోనే పడుకుంటాను బావా"

సుధ నోటినుంచి వస్తున్న వాసననుబట్టి అసలు విషయం కనిపెట్టనే కనిపెట్టాడు రమేష్ అతడు త్రాగాడు! పుస్తకాల పురుగు సుధాకర్ త్రాగాడా ?!

"అలాగే రా గదిలో కాసేపు కూర్చుందాం"

కిటికీ దగ్గర చెరో కుర్చీలో కూర్చున్నారు

"చాలా పొరపాటు జరిగిపోయింది బావా"

"పొరపాటు ఏముందిలే సుధా, యిందులో యీ మోడ్రన్ వరల్డ్‌లో త్రాగటం ఫ్యాషన్ — అంటే నా దృష్టిలో — నలుగురిలో సభ్యతకోసం— ఏదో చేస్తుంటాం ఎటికెట్ యీజీ దాన్ని గురించి బాధపడకు అయితే యీవేళ త్రాగితే త్రాగావు కానీ — అలవాటుమాత్రం చేసుకోకు నువ్విలా చేసుకొంటే ముఖ్యంగా మీ అమ్మ, నాన్న ఉరోసుకుంటారు" వ్యంగ్యంగా అన్నాడు రమేష్ సుధ మాత్రం తన మామూలు ధోరణిలోనే వున్నాడు

"ఈ స్థితిలో ఇంటికి వెళ్లలేకే "

"ఇక్కడికి వచ్చావ్! లేకపోతే మా యిల్లు నిలాంటివాళ్ళ కళ్లకు ఎందుకు కనిపిస్తుంది ?"

"అలాంటి ఉద్దేశ్యం నాకు లేదు"

"నీకు లేకపోయినా — ఏదో చెడిపోయినవాణ్ణి నేను యీ యింట్లో వున్నానుగా ? అందుకే మీ అమ్మ, నాన్న కట్టుదిట్టంచేసి నిన్నిక్కడికి రానీయలేదు అవునా ?"

సుధ మాట్లాడలేకపోయాడు తను చేసిన పాడుపనికి లోలోపల ఎంతో పశ్చాత్తాపపడుతున్నాడు

మొన్న మొన్నటివరకు సుధ లక్ష్యం కేవలం చదువే స్నేహితులుకూడా తక్కువమంది వుండేవాళ్ళు వాళ్లయినా చదువులో తనతో సమానమైన వాళ్ళు, తనలా ఏ దురలవాటు లేనివాళ్లే అలాంటిది మెడిసిన్ చదవాలన్న అతడి ఆశయం కొన్ని కారణాల వల్ల దెబ్బతిని, అయిష్టతమీద మామూలు డిగ్రీ క్లాసులో చేరేసరికి మానసికంగా కొంత మార్పు వచ్చింది పైకి యాంత్రికంగా అన్ని కర్తవ్యాలూ నెరవేరుస్తున్నా — తన ఆశ ఫలించకపోయిందేమా అన్న దిగులు అతడి అంతరంగంలో గూడుకట్టుకొని అలాగే నిలిచిపోయింది తత్కారణంగానే చదువు అంటే అశ్రద్ధ పెరిగింది ఎవరితోపడితే వాళ్లతో స్నేహం మొదలుపెట్టాడు మధ్య మధ్య క్లాసులు ఎగ్గొట్టి బజార్లుపట్టుకు తిరగటం, లేదా సినిమాలు చూడటం అలవాటైపోయింది

అలాగే యీవేళ ఒక మిత్రుడి బర్త్‌డే పార్టీకి వెళ్లాడు

ఆ పార్టీ యిచ్చినతడి పేరు రవీంద్రనాథ్ వాళ్లది అక్కడికి దగ్గరలోనే ఒక పల్లెటూరు లక్షాధికారులకు ఒక్కగానొక్క బిడ్డ విచ్చలవిడిగా డబ్బు ఖర్చుచేయటం అతడి హాబీ పదిమంది స్నేహితులను వెంటేసుకొని ఊరంతా తిప్పుతూ — వాళ్ల ఖర్చులన్నీ తనే భరించటం అతడి నిత్య కార్యక్రమం ఆ కుర్రవాళ్లందరి మధ్య తానొక హీరోగా చలామణీ కావాలన్నది అతని తాపత్రయం వచ్చే ఎలక్షన్‌లలో తాను ఆ కాలేజీ విద్యార్థులకు నాయకుడిగా ఎన్నిక కావాలన్నది అతని ఆకాంక్ష అందుకు ఇప్పట్నుంచే ప్రాపకం సంపాదించుకోవటానికి మధ్య మధ్య నలుగుర్ని పిల్చి ఏదో నెపాన పార్టీలు ఇస్తుండాలని ఎత్తుగడ వేశాడు అలాగే ఆవేళ తన బర్త్‌డే అంటూ పార్టీ ఏర్పాటుచేశాడు అదీ తన రూమ్‌లో కాదు — హోటల్ సంగమ్‌లో!

రవీంద్రనాథ్ చదివేది బి ఏ సెకండ్ ఇయర్ సుధకు అతడికి మధ్య ముఖపరిచయం తప్పితే స్నేహం లేదు అయినా ఆ మధ్యాహ్నం ఒక స్నేహితుడితో కలిసి క్యాంటీన్‌లో 'టీ' త్రాగుతూండగా రవీంద్రనాథ్ నలుగురిని వెంట వేసుకువచ్చాడు అప్పుడు సుధతో ఉన్న కృష్ణప్రసాద్‌కు అతడికి కొంతలో కొంత స్నేహం ఉంది దాన్ని పురస్కరించుకొని ఆ ఇద్దర్నీ కూడా తన పార్టీకి రావలసిందిగా కోరాడు అందుకు సుధ కొంత సందేహించినా అతడి తరపున కూడా తనే 'ఓ కె' చెప్పేశాడు కృష్ణప్రసాద్ రవీంద్రనాథ్‌కు

ఆ పార్టీకి తప్పదన్నట్లే వెళ్లాడు సుధ బర్త్‌డే పార్టీ అంటే మామూలు ఫంక్షన్‌లా జరుగుతుందని అనుకున్నాడు అయితే అక్కడికి వెళ్లి చూస్తే — ఆ వాతావరణమే వేరుగా ఉంది అలాంటి చోట అడుగు పెట్టటం సుధ జీవితంలో అదే మొదటిసారి అప్పటికీ తను కూల్‌డ్రింక్‌తో సరిపెట్టుకుందామని విశ్వ ప్రయత్నం చేశాడు కానీ, ప్రక్కనున్న ఘటాలు అతన్ని అలా వదిలిపెట్టలేదు కేవలం సభ్యతకోసమే సుధ ఆనాడు మిత్రులందరితో పాటు — తనూ త్రాగాడు!

ఆ అవస్థలో ఇంటికి వెళ్తే అక్కడ పరిస్థితి ఎలా మారుతుందో ? అందులో ఆలిస్తే ప్రేవులు లెక్కపెట్టే తండ్రి — ఏ మిత్రుడి రూమ్‌లోనైనా పడుకుందామన్నా మనస్కరించలేదు 'వాళ్ళతో ఇంకా ఉంటే బలవంతం చేసి మరేపని చేయిస్తారో తనతో ?—' అనే సందేహించాడు కేవలం ఆ రాత్రి తల దాచుకోవటానికి మేనత్త ఇంటికి వచ్చాడు అత్తయ్యకు అయితే ఏదో విధాన సర్ది చెప్పవచ్చునన్నది అతడి ధైర్యం అదృష్టవశాత్తు తను తలుపు కొట్టటంతో సీతమ్మత్త కాకుండా రమేష్ తలుపు తీయటంతో అతడి ప్రాణం కొంత తెప్పరిల్లినట్లయింది

"ఈ సంగతి రెండో కంటికి తెలియనివ్వను నువ్వు నిశ్చింతగా ఈ రాత్రికి ఇక్కడ పడుకో" అన్నాడు రమేష్

"మెనీ మెనీ థాంక్స్ బావా" అంతకుమించి ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో తోచలేదు సుధకు

కొద్దిసేపు గడిచిన తర్వాత రమేష్ అన్నాడు

"జీవితాలతో చెలగాటలాడటం నాకు చేతకాదు సుధా మీ నాన్న ఎంత జగమొండో నాకు తెలుసు




ఇప్పుడు నీ విషయం ఆయనకు తెలిస్తే పరిస్థితి ఎంత దారుణంగా మారుతుందో నేను ఊహించి చెప్పగలను"

"నిజమే బావా"

"కానీ, నేనలా చేయను కారణం నాకూ మనసంటూ ఒకటుంది మంచి చెడుల విషయంలో ఒక్కో మనిషికి ఒక్కో పిరియడ్ ఉంటుంది ఇంకోటి - నువ్విప్పుడు త్రాగావంటే నీలో చెడు స్వభావం ఉండే అలా చేశావా ? కాదు! నీ చుట్టూ అల్లుకుపోయిన వాతావరణం నీచేత అలా చేయించింది అట్లాగే నేను! - మొన్న మొన్నటివరకు నాపై ఎవరికీ సదభిప్రాయం లేదు నా ప్రవర్తనా దానికి తగినట్లే ఉండేది అందుకు కారణాలు లేకపోలేదు మా అమ్మ నాన్నలకు నేను ఒకణ్ణే అతి గారాబంగా పెంచారు ప్రేమకొద్దీ మా నాన్న నాకు అడగకుండానే పాకెట్ మనీ క్రింద అయిదులు పదులు ఇస్తుండేవాడు చిన్నప్పుడే ఆ వయసుకు ఆ డబ్బు ఎలా ఖర్చుపెట్టాలో తెలియక ఆ స్నేహితుడనీ, ఈ స్నేహితుడనీ నలుగుర్నీ కూడవేసుకొని బజార్లవెంట తిరిగేవాణ్ణి అలా అలా సిగరెట్, పేకాటలాంటి అలవాట్లు మొదలయ్యాయి డబ్బు అవసరం పెరిగింది ఆ సమయంలోనే మా నాన్న పోవటం జరిగింది అమ్మ నా చేతికి డబ్బు చిక్కనీయకుండా చేయాలని చూసేది కానీ నా అలవాట్లు— డబ్బు అవసరాన్ని ఎక్కువ చేశాయి ఆ అవసరం కొద్దీ నే ఎక్కడబడితే అక్కడ అందిన వస్తువుల్ని చేజిక్కించుకొని ఇష్టమైన ధరకు అమ్ముకొండేవాణ్ణి మీ ఇంట్లోకూడా రెండు మూడు సార్లు దొంగతనం చేశాను మీ అమ్మా నాన్న ఈ విషయం నీకు చెప్పేవుంటారు రాను రాను ఏ చుట్టపక్కాలింటికి వెళ్ళినా నన్ను హీనంగా చూడటం మొదలుపెట్టారు అందరిలో నేను చులకన కావటానికి మూలం ఏమిటని ఆలోచించాను ఎలాగైనా నా ప్రవర్తనను మార్చుకోవాలనీ, నలుగురిలో మంచిపి పెంచుకోవాలనీ అనుకున్నాను అలాగే యిప్పుడు మారిపోయాను ఇక మీ సుజాతను చేసుకోనన్నానంటే అందుకు కారణాలు వేరు—అందరి బలవంతం వల్ల నేను మీ అక్కను చేసుకున్నా మా దాంపత్యం సాఫీగా సాగిపోతుందన్న నమ్మకం నాకు కలుగలేదు ఆమె జీవితం నరకప్రాయం చేయటం నాకు ఇష్టం లేకపోయింది అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరమే మేలనిపించింది కొంచెం అనాకారి అయినంత మాత్రాన సుజాతకు భవిష్యత్తు లేదని నేననను ప్రతి మనిషికీ జీవితంమీద ఆశ ఉంటుంది అయితే ఆమె విషయంలో నా అభిప్రాయంమాత్రమే చెప్పాను ఎందుకంటే బ్రతుకుమీద నాకూ కొన్ని ఆశలు వున్నాయి కనుక"

ఆ మాటలు వింటుంటే రమేష్‌ది యెంతో మంచిమనసుగాను, అతడొక నిష్కపటుడుగాను తోచింది సుధకు అతడి వెనుకటి ప్రవర్తన పూర్తిగా మారిపోయిందన్న నమ్మకం కూడా కలిగింది నిజాన్ని కుండ బద్దలుకొట్టినట్లు చెప్పే రమేష్ అంటే అప్పుడే కొంచెం గౌరవభావం కలిగిందతడికి

"ఇక మీ సుజాత జీవితానికేం ఫరవాలేదు సుధా! విశ్వం మీ యింటికి వచ్చాడు అతడు మీ అక్కను చేసుకోవటానికి అంగీకరించాడు అని తెలిసి నప్పుడు నేనెంత సంతోషించానో! అయితే, సుధా! నీవు ఏమీ అనుకోనంటే ఒక విషయం చెబుతాను" అన్నాడు రమేషే మళ్లీ

"అనుకొనేదేముంది? చెప్పు బావా!"

"రాను రాను ఆ విశ్వం ప్రవర్తన చూస్తుంటే మన అందరి ఆశలు నెరవేరుతయ్యా? అన్న అనుమానం కలక్క మానటంలేదు మొదట్లో వున్న అతడి అభిప్రాయాలు యిపుడిపుడే మారటం మొదలుపెట్టాయని నాకనిపిస్తోంది"

"అతడేం చేశాడు బావా?"

"సుజాత మాట గాలికి వదిలేసి సుమమీద ఆశలు పెంచుకొంటున్నాడు!"

"నీకెలా తెలిసిందిది?"

"అక్కడే వచ్చింది చిక్కు — నా మాటమీద నమ్మకం చిక్కదెవరికీ"

"అదికాదు బావా"

"ఆధారంలేకుండా నేనెలా అంటాను? కాక పోతే నువ్వూ ఒకకంట కనిపెట్టిచూడు ఏదైనా, సుధా! పైకెలా మాట్లాడినా అంతరంగంలో తన జీవితాన్ని నరకప్రాయం చేసుకోవాలని ఏ మనిషీ కోరుకోడు ఉన్నమాటేమో నాన్చకుండా చెప్పి మీ అందరికీ వెగటయ్యాను తన మనసును దాచుకొని పైకి నాటకం ఆడుతున్నాడు విశ్వం రోజులుకూడా అలాంటివాళ్లవేలే"

"అలాగా! నువ్వు చెప్పినట్లే ఓ కంట కనిపెట్టి చూస్తాను అతణ్ణి నా కు కూ డా అనుమానం చిక్కితే నాన్నగారికి చెప్పేస్తాను విశ్వం మోసగాడైతే అతడి ఆటలు ఏనాటికీ సాగనివ్వం మేం"

సుధ పరుషమైన మాటలు విన్న రమేష్ మనసు ఎంతో సంతృప్తితో నిండిపోయింది ఆ వుత్సాహంలో ప్రక్కనే వున్న సిగరెట్ ప్యాకెట్ తీసి తనొకటి తీసుకొని సుధ కొకటి అందివ్వబోయాడు అయితే అతడు నాకు అలవాటులేదు వద్దన్నాడు

"కంపెనీకోసం ఏ పనిచేసినా అది అలవాటు క్రిందికి రాదులే — తీసుకో"

తప్పదన్నట్లే తీసుకున్నాడు సుధ

"బావా! నా విషయం ఎవరితో అనవు కదూ?" పడుకోబోయేముందు మరోమారు అన్నాడు సుధ

"అనములే నువ్వుకూడా నేను చెప్పిన విషయం మరిచిపోబోకు ఆ విశ్వం వుత్త డేంజరస్‌ఫెలోలా వున్నాడు"

తను ఏదోవిధంగా సుధను నమ్మించగలిగి నందుకు ఎంతో సంతృప్తిపడి హాయిగా నిద్ర పోయాడు రమేష్

తెల్లవారి లేచాక సీతమ్మ అడిగింది, "ఏరా సుధా! రాత్రి యిక్కడే పడుకున్నావ్ — ఇంటిదగ్గర చెప్పే వచ్చావా?" అని

## కాలమిచ్చిన తీర్పు

"చెప్పిరాలేదు రాత్రి ఒక మిత్రుడింటికి పార్టీకి వెళ్ళాట్ట సుధ అక్కణ్ణుంచి వచ్చేసరికి ప్రొద్దుపోయింది ఆ వేళప్పుడు ఇంటికి వెళ్తే మామయ్య ఏమంటాడోనని ఝడిసి యిక్కడ పడుకున్నాడులే అమ్మా" సుధకు బదులు రమేషే తల్లికి నచ్చచెప్పాడు

"చదువుకొని పైకిరావలసినవాడివి — యిలా చేస్తే ఎలారా సుధా? ఒక్కగానొక్క మగబిడ్డవు నీమీద ఎన్ని ఆశలు పెట్టుకున్నాడు అన్నయ్య! మరెప్పుడైనా యిలా చేస్తే మీ నాన్నకు గట్టిగా చెప్పేస్తాను" అంటూ హెచ్చరించింది సీతమ్మ

ఇంటికి వచ్చాక తల్లిదండ్రులకు సుధ చెప్పిన సమాధానం —

"రాత్రి ఆ బజారులో వస్తూ ఒకసారి అత్తయ్యను చూద్దామని వాళ్ళింటికి వెళ్లాను వెంటనే వచ్చేద్దామంటే రమేష్‌బావ, అత్తయ్య ఒకటే బలవంతంచేశారు అందుకని రాత్రి అక్కడే వుండిపోయాను" అనీ

అలా చెప్పమని రమేషే ఉపదేశించాడు అతడికి

## *10*

విశ్వం ప్రవర్తన సుందరిలో రాను రాను అనుమానాన్ని రేకెత్తిస్తోంది అతడు సుజాతకంటే సుమ అంటేనే యిష్టపడుతున్నట్లు కనిపిస్తు న్నాడు వాళ్లిద్దరూ ఎప్పుడూ ఏదో మాట్లాడు కొంటూండటం—తరచూ కలిసి బజారుకు వెళ్లటం జరుగుతోంది చివరకు సహించలేక అదే విషయం భర్తముందు ఎత్తింది

### సప్త స్వరాలు

అగ్రహారా లక్కఱలేదు, మా కవితకు
అచ్చుపడితే చాలు బొమ్మల పత్రికల్లో,

అక్షర లక్ష లక్కఱలేదు, మా కవితకు
లక్షలమ్మే పత్రికలలో కనబడితే, అలం!

దిట్టలయిన పండితు "లోహో!" అనవక్కఱలేదు
అట్టఅడుగు మాసిపి "ఆహాహా!" అంటే, చాలు!

పట్టుమని పది కాలాలపాటు కీర్తి వద్దు
గట్టిగా మరు పత్రిక వచ్చేదాకా హద్దు

తిక్కన్నంత కవి కావాలనే, దురాశ మాకు లేదు
ఒక్క వేమన్నంతవానిగా చెలామణి చాలు!

గలగలా పారే గంగా ప్రవాహం కాదు
జలజలా పారే సెలయేఱు మా కవిత

రాయల వంటివాని సన్మానం మాకేల? తు
రాయి ఉన్న ఏ నాయకునిదయినా చాలు

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

ముందు సుబ్బరామయ్య విశ్వంమీద వున్న నమ్మకంకొద్దీ భార్య అంచనాలు తప్పని కొట్టి పారేస్తూ వచ్చాడు కానీ, ఆనాడు సాయంత్రం తను ఆఫీసునుంచి జీపులో వస్తూ రోడ్డుప్రక్కగా ఉల్లాసంగా కబుర్లాడుతూ, మధ్య మధ్య నవ్వు కొంటూ పోతున్న విశ్వం, సుమలను చూశాక అతడి లోనూ కొన్ని సందేహాలు తలెత్తక మానలేదు 'సుందరి అనుమానాలకు అర్థం లేకపోలేదేమో?' అనిపించింది

ఆ రాత్రల్లా యీ విషయం గురించే ఆలో చించాడు ఏదో ఒక దారిన పడబోతోందనుకున్న సుజాత జీవితం ఏనాటికీ అంతేనా? అసలు విశ్వం అంతర్యమేమిటి? పైకి చూడబోతే అతని మాటలు అంత ఆశాజనకంగా వున్నాయి మరి! అయితే అతని బాహ్యప్రవర్తన కేవలం నటింపేనా? తన స్వార్థం చూసుకొనే సుజాతను చేసుకుంటానని అందర్నీ నమ్మిస్తున్నాడా? ఒకవేళ అతడి మంచిమనసును సుమే మార్చివేయుటంలేదుకద?

ఏదో ఒకటి తేల్చుకోవాలి అనవసరంగా ఆశలు పెంచుకొని అవి నెరవేరవని తెలిశాక కుప్పలా ఒకచోట కూలిపోయేకంటే — అతడి అసలు రంగు ఏమిటో ముందే తెలుసుకొని జాగ్రత్తపడటం సర్వత్రా మంచిది సుజాత మతిచెదరి చివరకు ఏ అఘాయిత్యానికో పూనుకొనే అవసరం కల క్కుండా పోతుంది

అందుకే మర్నాడు ఉదయం తన ఆఫీసు గది లోకి కాఫీ తీసుకువచ్చిన పెద్ద కూతురితో, "సుజా, సినిమాకు వెళ్తావా?" అన్నాడు

తండ్రి ఆంతర్యం తెలియక అంత ప్రొద్దుటే సినిమా మాట ఎత్తిన ఆయన వైపు ఆశ్చర్యంగా చూసింది సుజాత

"అది కాదమ్మా నువ్వు సినిమాకు వెళ్లి చాలా కాలమయిందిగా? సుమ అంటే వారానికి రెండుపార్లు వెళ్తానే ఉంది సుధ సరేసరి ఏ వయసులో ఆనందాలు ఆ వయసులో అనుభవించా లమ్మా" అన్నాడు — తన అసలు ఉద్దేశ్యం అప్పటికీ కూతురి ముందు బయట పెట్టలేకపోయాడు సుబ్బరామయ్య దాన్ని ఎలా ప్రస్తావనకు తేవాలో అతనికి అంతుపట్టటం లేదుమరి

సుజాతకు అప్రయత్నంగా కళ్ళనీళ్ళు తిరిగాయి తండ్రి మాటలు విన్నాక

"అదేమిటమ్మా, సుజా, ఎందుకు కన్నీళ్ళు? నే నేమయినా పొరబాటుగా మాట్లాడానా?" సుబ్బ రామయ్య కొంచెం ఖంగారు పడ్డాడు

"లేదు నాన్నగారూ" అంటూ త్వర త్వరగా కళ్ళు తుడుచుకొని, "నన్ను భగవంతుడు కన్నీటి కోసమే పుట్టించాడు కానీ, నాన్నగారూ, నా విష యంలో మీరు చూపే అభిమానం, తీసుకొనే శ్రద్ధ— ఇవి తలుచుకున్నప్పుడల్లా నాకు పట్టరాని సంతోషం కలుగుతుంది మీ ముందు నా కళ్ళు ఎప్పుడు తడి అయినా అవి ఆనందభాష్పాలే" అంది సుజాత

[ఇంకా వుంది]

GEMINI

# జెమినీ టీ

## రుచికి రాజమకుటం ఈ టీ






ఇదుగో సిరులెన్నో ఉప్పొంగే జెమినీ టీ.
రాజదర్బారు యొక్క అనుభవం చవిచూస్తారు మీరు.
ఆ దర్జా రాసికి చెందిన చిక్కని టీ.
అందుకే మీకు మరిన్ని కప్పులనిస్తుంది.
ఇది మీరు ఉత్సవం జరుపుకునేలాంటి పొదుపు.
ఇంకనుంచి ఉత్సాహంతో ఉవ్విళ్ళూరండి, జెమినీటీతో.

**జెమినీటీ టాటా-ఫిన్లే వారిది.**

dCA/TFGT/2c Tel.

# సినిమా విశేషాలు



'మనుషులంతా ఒక్కటే'లో రామారావు

### /త్రిమూర్తిలో కృష్ణత్రయం/

త్రిమూర్తి ప్రొడక్షన్స్ వారి ప్రొడక్షన్ నెం 1 ఫిబ్రవరి 26న ప్రసాద్ లో జరిగిన సాంగ్ రికార్డింగ్ తో రంగ ప్రవేశం చేసింది సెంటిమెంట్ తో స్టంట్ మిక్స్ అయిన ఈ చిత్రంలో ముగ్గురు కృష్ణలు పని చేయడం విశేషం నాయక పాత్రను హీరో కృష్ణ, చిత్ర సంభాషణా రచయిత పాత్రను భమిడిపాటి రాధాకృష్ణ, చిత్రఛాయాగ్రహణాధిపత్య పాత్రను పుష్పాల గోపీకృష్ణ స్వీకరించారు

ఈ చిత్రంలోని రెండు పాటల చిత్రీకరణ కోసం వూటీ ట్రిప్ వేసారు త్రిమూర్తి నిర్మాతలు జి సాంబశివరావు ఎ బాబ్జీ ఉల్లాసమైన ఈ క్యాంపును హీరో కృష్ణ మంజుల వృథా కానివ్వలేదు వలపు పాటలు పాడుకుంటూ దర్శకుడు కె యస్ ఆర్ దాస్ గారి వర్క్ ను సులభంగా పూర్తిచేశారు ఈ ప్రేమజంట వూహించే ప్రేమ గీతాలను ఆరుద్ర దాశరథి రచించగా పుష్పాల గోపీకృష్ణ సుందర ప్రదేశాన్ని అతి సుందరంగా చూపించడంలో తన స్కిల్ ప్రదర్శించారు

### మే కంతా రెడీ!

మే నెలాఖరుకు ఈ చిత్రాన్ని పూర్తిచేసే ప్రయత్నంలో వున్నారు నిర్మాతలు సాంబశివరావు, బాబ్జీ సత్యం సంగీత సారథ్యం యస్ కృష్ణారావు కళా సారథ్యం వహిస్తున్న ఈ చిత్రంలో సత్యనారాయణ నాగభూషణం ప్రభాకరరెడ్డి, పద్మనాభం ప్రధాన తారాగణం

### ప్రగతిపథంలో రామకృష్ణ!

దుక్కిపాటి మధుసూదనరావుగారి ఆశీర్వాద బలంతో వారి విచిత్రబంధం చిత్రంలో నటసామ్రాట్ కు పాడ తన వాయిస్ అగ్రనటుడికి సూట్ అవుతుందనే సదభిప్రాయం అందరికీ కలిగేలా తొలి చిత్రంలోనే నిరూపించి అక్కినేని ఆదరణకు పాత్రమైన గాయకుడు రామకృష్ణ నేడు సంగీత దర్శకులందరి దగ్గర పాడుతున్నాడు

ఏ వస్తువు రుచి అయినా తినగా తినగానే తెలుస్తుంది ఓ మనిషి ప్రతిభ కూడా కాలం గడిచే కొద్దీ బయటపడుతుంది ఇటీవల జెమినీ రికార్డింగ్ థియేటర్లో రామకృష్ణ ఓ పాట పాడుతున్నాడు నారాయణరెడ్డి వ్రాసిన ఆ పాట రాజేశ్వరీ చిత్ర వారి మహాత్ముడు చిత్రంలో సుశీల కూడా తన గొంతును కలిపింది ఆ పాటలో

ఎంతగా చూస్తున్నా వింతగానే వుంది
కనులెంత మూసుకున్నా గిలిగింతగానే వుంది

అంటూ రామకృష్ణ సుశీల పాడుతుంటే అక్కడున్న అందరి తలలు ఊయలలా ఊగసాగాయి అంతటి చక్కటి బాణీని కూర్చారు సంగీత దర్శకుడు చలపతిరావు బాణీ కూర్చడం సంగీత దర్శకుడి వంతు అయితే ఆ బాణీని చక్కగా పాడడం గాయకుల బాధ్యత అప్పుడే సాహిత్య రచనకు సంగీత రచనకు అందమొస్తుంది ఆ పాటలో కొన్ని చరణాలను రామకృష్ణ పాడిన వైనం ప్రశంసనీయం మాంచి శృతిలో మధురంగా పాడాడు రామకృష్ణ చిత్ర నిర్మాత కథకుడు దర్శకుడు గోపీనాథ్ చాలా బాగా పాడారండీ అంటూ రామకృష్ణను అభినందిస్తుంటే నేనూ కంగ్రాట్యులేట్ చేసాను

ఆ మరుసటి దినమే భక్త కన్నప్ప చిత్రంలోని పాటలను హీరో కృష్ణంరాజా టేప్ వేసి విన్పించారు కృష్ణంరాజు వాయిస్ కు రామకృష్ణ వాయిస్ ఎంత చక్కగా అమరిందో అంతే గొప్పగా ఆ చిత్రంలోని పాటలను రామకృష్ణ గానం చేసాడు ఏ మెలోడియస్ వాయిస్ ఇండీడ్!

అక్కినేనికి రామకృష్ణ వాయిస్ బాగుంటుందనే అభిప్రాయం ఎందరికో వుంది అది నిజం అని రాబోవు చిత్రాలు ఎలాగూ నిరూపిస్తాయి రామకృష్ణ ప్రగతిపథంలో సువాసనలు గుబాళిస్తాయి

### ఓ మనిషీ తిరిగి చూడు

బాబ్ అండ్ బాబ్ కంబైన్స్ తలపెట్టిన సంచలనాత్మక చిత్రం ఓ మనిషీ, తిరిగిచూడు దీనికి కథ మాటలు సినిమా అనువాదం గడుసరి సమకూర్చ, దాసరి దర్శకత్వాన్ని నిర్వహిస్తారు

### ముగ్గురు మిత్రుల కథ

ఓ మనిషీ తిరిగి చూడు' చిత్రం ముగ్గురి చుట్టూ జరుగుతుంది, అన్నారు దర్శకుడు దాసరి మూడు పాత్రలను మురళీమోహన్ ఈశ్వరరావు మోహన్ బాబు పోషిస్తారు

'స్వర్గం నరకం' చిత్ర నిర్వాహకుడు, చిత్ర పరిశ్రమలో విశేషానుభవం గడించిన ప్రజ్ఞావంతుడు దిడ్డి శ్రీహరిరావు యీ చిత్రానికి నిర్మాత

కథానాయిక పాత్రను కొత్తమ్మాయికి యివ్వదలచారు, నిర్మాత శ్రీహరిరావు ఈ చిత్రం షూటింగు ఏప్రిల్ నుంచి జరుగుతుంది

'అల్లుడొచ్చాడు'లో రాజబాబు ప్రభ



## "సెక్రటరీ"లో బొమ్మల పెళ్లి

ఆనాడు ఆ ఇంట్లో ఒకటే సందడి కారణం బొమ్మల పెళ్లి ఎంతో హుషారుగా, హాపీగా బొమ్మల పెళ్లికి కావలసిన ఏర్పాట్లు చేయడంలో నిమగ్నమై వున్నది వాణిశ్రీ (జయంతి) ఇలాంటి సన్నివేశాన్ని మరింత రక్తి కట్టించాలనే ఆలోచన మెరిసింది ఆత్రేయ మెదడులో దాని ఫలితమే ఈ క్రింది పాట

ఆకాశమంత పందిరి వేసి
భూదేవంత పీట వేసి,
చిట్టిపొట్టి బొమ్మల పెళ్లి చేద్దాం రారండి
తియ్యని లడ్లు పాయసాలు తిందాం రారండి'

అంటూ వాణిశ్రీ ఆనందంగా ఆహ్లాదంగా పాడుతూ బొమ్మల పెళ్లిని వైభవంగా జరిపింది ఇదే పాటను ఒకే సమయంలో హీరో కూడా పాడితే సన్నివేశానికి మరింత బలముంటుంది, అర్థముంటుంది అనే అయిడియా తట్టింది దర్శకుడు కె ఎస్ ప్రకాశరావుకు తత్ఫలితమే అక్కినేని కూడా వాణిశ్రీ అక్కడ బొమ్మల పెళ్లి చేస్తూ పాడుతుంటే తానెక్కడో వుండి అదే పల్లవితో పై పాటను పాడిగిస్తారు తెర వెనుక అక్కినేనికి రామకృష్ణ, వాణిశ్రీకి సుశీల పాడారు

ఆ బొమ్మల్లో ఆడబొమ్మ వాణిశ్రీ, మగ బొమ్మ అక్కినేని అయితే ఎంత బాగుంటుంది అని చిత్రం చూచే మనందరం తప్పక వూహించుకుంటాం అందుకే కాబోలు రామానాయుడు తన సెక్రటరీ చిత్రంలో పై తతంగమంతా సృష్టించారు

నటసామ్రాట్ కళాభినేత్రి పోటీపడి నటించిన ఈ చిత్రం త్వరలో నవయుగ ద్వారా విడుదలౌతుంది

## అన్నపూర్ణా స్టుడియోస్‌లో అక్కినేని లేని చిత్రాలు

నటసమ్రాట్ నటించని చిత్రాలనుకూడా ఆయన స్టుడియోలో నిర్మించవచ్చు అని యిద్దరు నిర్మాతలు ఋజువుచేస్తున్నారు భాగ్యనగరంలో చిత్ర పరిశ్రమ అభివృద్ధిని మనసారా కాంక్షించే అక్కినేని తన స్టుడియోలో ఎట్టి ఆంక్షలు విధించరు అనెడి నిజానికి నిదర్శనమే ఆ రెండు చిత్రాల నిర్మాణము

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు సమర్పించు మనిషి రోడ్డున పడ్డాడు' చిత్ర నిర్మాణం

అదృష్టవంతురాలు'లో ప్రభ చలం





సెక్రటరీ లో కాంచన నాగేశ్వరరావు

అన్నపూర్ణా స్టుడియోలో జరుగుతుంది సూర్యశ్రీ పిక్చర్స్ వారి షూటింగు అక్కడే జరుగుతుంది

### సూర్యశ్రీ ఎక్స్‌ప్రెస్!

ప్రముఖ ఛాయాగ్రహణ దర్శకుడు అక్కినేనికి ఆప్తమిత్రుడు అయిన రామకృష్ణారావు నెలకొల్పిన సంస్థ సూర్యశ్రీ ఎక్స్‌ప్రెస్

ఈ సంస్థ నిర్మిస్తున్న తొలి చిత్రం షూటింగు అన్నపూర్ణా స్టుడియోస్‌లో జరుగుతుంది ఈ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకుడు

### అక్కినేని ఆశీర్వాదం!

తను సినిమా రంగాన్ని ప్రవేశించిన రోజులగాయితు యిప్పటివరకు అక్కినేనిగారి ఆశీర్వాదం లభిస్తూ వుందని తను చిత్ర నిర్మాత కావడానికి ఆయన ప్రోత్సాహమే కారణమని, సూర్యశ్రీ ఎక్స్‌ప్రెస్ అధినేత రామకృష్ణ చెప్పారు

"మే' నుంచి షూటింగు జరుగనున్న సూర్యశ్రీ ఎక్స్‌ప్రెస్‌కు సత్యానంద్ మాటలను మహదేవన్ సంగీతాన్ని జి వి సుబ్బారావు కళను విక్టరీ దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు

నాయక పాత్రను మురళీమోహన్ నాయిక పాత్రను జయప్రద పోషించ, సత్యనారాయణ రాజబాబు ముఖ్య కథా పాత్రలను అంగీకరించారు ఈ చిత్రం అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదల అవుతుంది

నిర్మాతగా మారిన రామకృష్ణకు ప్రజాబలం లభించాలని ఆశిద్దాం

### ఇదెక్కడి న్యాయం?

లలితా మూవీస్ తలపెట్టిన చిత్రానికి యిడిన పేరు యిది ఈ సంఘంలో స్త్రీకి ఒక న్యాయం, పురుషుడికొక న్యాయమా అనెడి సమస్యపై నడిచే కథ గాబట్టి ఇదెక్కడి న్యాయం' సరయిన మకుటం కాగలదు

ఇదెక్కడి న్యాయం చిత్రంలోని ప్రధాన పాత్రలను శారద సత్యనారాయణ పోషించగలరని, నిర్మాత ప్రసాద్ చెప్పారు

ఎంతో బిజీగా వున్న దాసరిగారు, తనకు యింత త్వరగా కాల్‌షీట్లు యిచ్చినందుకు ప్రసాద్ తన కృతజ్ఞతలు తెలుపుతున్నారు



ప్రేమాయణంలో చంద్రమోహన్ హేమాచౌదరి

### దేవుడు చేసిన బొమ్మలు !

ఫిబ్రవరి యిరవై నాలుగున విజయవాడ పట్టణాన లక్ష్మి ఫిలిం ఆర్ట్స్‌వారి దేవుడు చేసిన బొమ్మలు చిత్రం షూటింగు ప్రారంభమైంది

మనమంతా నిమిత్తమాత్రులం క్షణ భంగురములైన మన శరీరాలు దైవాధీనం ఆయన ఆడించే జగన్నాటకంలో మనం సూత్రధారులం ఎప్పుడు ఎయ్యేది జరుగునో అదంతా ఆయన ఆజ్ఞానుసారంగానే వుంటుంది అనేడి నిజాన్ని ఆధారంగా తీసుకుని, దర్శకుడు హనుమాన్ ప్రసాద్ ''దేవుడు చేసిన బొమ్మలు'' కథను అల్లారు.



### మూడు జంటల కథ

దేవుడు చేసిన బొమ్మలు చిత్రంలో మూడు జంటలు వున్నాయి మురళీమోహన్ జయసుధ చలం అనిత, గిరిబాబు ప్రభ వీరితోబాటు కొమ్మినేని వరలక్ష్మి సహాయ పాత్రలను పోషిస్తున్నారు

దే చే బొ చిత్రానికి జంధ్యాల సంభాషణలను, సత్యం సంగీతాన్ని భాస్కరరావు ఛాయాగ్రహణాన్ని నిర్వహిస్తున్నారు బి రామతారకం సమర్పించు యీ చిత్రానికి తిరపతి చిత్ర నిర్మాత హనుమాన్‌ప్రసాద్ దర్శకుడు

స్టుడియో ప్రమేయం లేకుండా, విజయవాడ లోని భవంతుల్లో యీ చిత్రం షూటింగు పూర్తి అవుతుందన్న వార్తను కథకుడు హనుమాన్‌ప్రసాద్ చెప్పారు

### ఒకే చిత్రంలో ఎనమండుగురు

నాట్యాచార్యులు తవ చిత్రకళా వైశిష్ట్యాన్ని ప్రదర్శించారు ఆ చిత్రం పేరు దొరలు దొంగలు' ఆ చిత్రంలోని ఎనిమిది పాటలకు ఎనమండుగురిని ఎంపిక చేశారు నిర్మాత ఎమ్ ఎస్ రెడ్డిగారు

### కార్టూన్‌ల చొక్కా

ఖమ్మంలో జరిగిన కార్టూనిస్ట్‌ల సమ్మిట్‌కి ఓ ప్రముఖ కార్టూనిస్టు వేసుకున్న చొక్కామీద ఓ చిన్న కార్టూన్‌ల సావనీర్ వుండటంతో అతని వెంట అభిమానులు పడటం ఎక్కువైంది అతని చొక్కామీద ఎన్నికైన కొన్ని డజన్‌ల కార్టూన్ లున్నాయి (పై చిత్రం) వీటిని అతను ఫ్యాబ్రిక్ పెయింట్‌తో ఎంతో వోపికగా వేసుకుని దానితో షర్ట్ కుట్టించుకుని వేసుకొచ్చాడు అతని పేరు శ్రీ 'మురళీరమణ నివాసం మద్రాసు

## సినిమా

ఆ ఎనిమిది నృత్యాలను నేను చూశాను ఒక దానికి యింకొక దానికి వున్న వ్యత్యాసాన్ని, అవున్నత్యాన్ని ఆనందించాను

### భారీ చిత్ర నిర్మాణం !

సుందరం మూవీస్ నిర్మించిన దొరలు దొంగలు వర్ణ చిత్రాన్ని చూశాను చిత్రం ఆద్యంతం నిర్మాత పెట్టిన ఖర్చు కనిపించింది భారీ సెట్ల నిర్మాణం ఆర్టిస్టుల దుస్తులకోసం పెట్టిన ధనం పతాక సన్నివేశంకోసం ఖర్చెట్టిన భారీతనం నిర్మాత అభిరుచికి నిదర్శనం

### వాణిశ్రీ అద్భుత నటన

అగ్రనటి ద్విపాత్రాభినయం చేసింది యువ రాణిగా నటన హుందాను రాజసాన్ని ప్రదర్శించింది రజకస్త్రీ వేషాన్ని దుమ్ము దులిపేసింది ఆమె తప్ప మరొకరు కనిపించని విధంగా వాణిశ్రీ అద్భుతంగా నటించింది

### మధుర సంభాషణం

మల్లెమాల రాసిన మాటలు మధుర మధురంగా వున్నాయి సత్యం సంగీతం కె ఎస్ ప్రసాద్ ఛాయాగ్రహణం నువ్వా నేనా అన్నట్టున్నాయి

చిత్రంలోని ప్రధాన పాత్రధారులగు రామకృష్ణ శ్రీధర్ రాజనాల మంజుభార్గవి సుదర్శన్ గిరిజారాణి రంగనాథ్ తమ పాత్రలకు పూర్తి న్యాయం చేశారు

చంద్రమోహన్ నటన ఆనాటి లక్ష్మణ కుమారుడ్ని (రేలంగి) జ్ఞాపకం చేసింది

నిర్మాత ఎమ్ ఎస్ రెడ్డి నిర్మించిన యీ సిరోచిత జానపద చిత్రాన్ని యన్' అనగలర మన ప్రేక్షకులు విజయా పిక్చర్స్ విడుదల

'ఒక దీపం వెలిగింది'లో చంద్రకళ, రంగనాథ్







జ్యోతి లో జయసుధ గుమ్మడి * * * * * * * * * * * * * * * * * మహాకవి క్షేత్రయ్య లో నాగేశ్వరరావు మంజుల

## కలర్ కావ్య నాయిక !

కావ్య నాయిక అంటే వాణిశ్రీ కలర్ నాయిక అంటే అగ్రనటి అని రాసే ధైర్యం యీ విలేఖరికి వుండడానికి కారణం ప్రేక్షకుల బలం

ఏదేని నవల చదువుతుంటే మనకు నాయిక పాత్రకు వాణిశ్రీ మాత్రమే కనిపిస్తుంది నవలా రచయిత్రులకు కూడా వాణిశ్రీ పేరే అగుపిస్తుంది కావ్యనాయిక లక్షణాలు వున్న విలక్షణమైన నటి వాణిశ్రీ అంటే అన్యులు ఆగ్రహించరని అనుకుంటాను

రాబోయే కలర్ చిత్రాలలో వాణిశ్రీవి ఎక్కువ శాతం వున్నాయి

మార్చి 12న విడుదలయిన ఆరాధన ప్రేమ బంధం చిత్రాలలో ఏప్రిల్‌లో విడుదలయ్యే సెక్రటరీ లో అదే నెలలో వచ్చే ధొంగలు దొంగలు లో త్వరలో రామన్న భక్తకన్నప్ప లో వాణిశ్రీ వైవిధ్యం వున్న పాత్రలను పోషించినట్టే అన్నీ కలర్ చిత్రాలయ్యాయి

కళాభినేత్రి నటిస్తున్న కొత్త కలర్ చిత్రాల వివరం అనిల్ ప్రొడక్షన్స్ వారి పొగరుబోతు శ్రీ రామచిత్ర వారి ప్రయోగాత్మక చిత్రం, లక్ష్మీ ఫిలిం కంబైన్స్ వారి చక్రధారి' తారకరామా పిక్చర్స్ వారి కొత్త చిత్రం

ఇన్ని కలర్ చిత్రాలలో నటిస్తున్న వాణిశ్రీ ఒకేఒక నలుపు—తెలుపు చిత్రంలో నటిస్తున్నది చిత్రం పేరు గౌరమ్మా నీ మొగుడెవరమ్మా నిర్మాతలు బసిరెడ్డి పుష్పరాజ్ గార్లకు వాణిశ్రీ బ్లాక్ అండ్ వైట్ చిత్రం అంగీకరించడం కలిసొచ్చిన అదృష్టం అనే చెప్పాలి

గౌరమ్మ పాత్రలో సరికొత్త వాణిశ్రీ కనిపిస్తుంది మాస్ అప్పీల్‌తో బాటు వుమన్ క్లాస్‌ను తేగల వుత్తమ పాత్ర గౌరమ్మ దర్శకుడు లక్ష్మీదీపక్‌ను అదృష్ట జాతకుణ్ని చేసే చిత్రం గౌరమ్మా నీ మొగుడెవరమ్మా

## మూడు ముళ్లు"

బ్రతుకే ఒక పండుగ' చిత్రం విడుదల కాగానే, విజయకృష్ణా ఫిలింస్ తరపున 'మూడు ముళ్ళు చిత్రాన్ని ప్రారంభిస్తారు

స్త్రీకి మంగళసూత్రం ఎంత పవిత్రమైనదో, భర్త అనురాగ ఆప్యాయత, ఆత్మీయత అంత అవసరమనేడి నిజాన్ని చెప్పే కథ మూడు ముళ్ళు

హైద్రాబాద్ సారథీ స్టుడియోలో చిత్ర నిర్మాణం జరిగే మూడు ముళ్ళు చిత్రానికి ఎ చంద్రశేఖరరెడ్డి మహదేవన్ లక్ష్మణగోరే ముఖ్య సాంకేతిక సారథులు

ఈ చిత్రంలో రాధికతోబాటు ప్రేక్షకుల అభిమాన తారాగణం ముఖ్య పాత్రలను పోషిస్తారు

(30వ పేజీ చూడండి)

## నెల్లూరు నాటక కళాపరిషత్ నాటక పోటీలు ఫలితాలు

నెల్లూరు 12 వ వార్షికోత్సవం ఫ్రిబవరి 26 నుండి మార్చి 2 వరకు వైభవంగా నెల్లూరు టౌన్ హాలులో జరిగింది ప్రారంభోత్సవ సభకు శ్రీ ఆనం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించగా, హీరో కృష్ణగారు ప్రారంభోత్సవం చేశారు నటి శిరోమణి శ్రీమతి విజయనిర్మలగారు పదివేలమంది సమక్షంలో నటరాజ పూజ గావించారు నాటక పోటీ ఫలితాలిలా వున్నాయి

నాటకాలు ఉత్తమ ప్రదర్శన శ్రీ గురజాడ కళామందిర్ విజయవాడవారి సమాధానం కావాలి ఉత్తమ ద్వితీయ ప్రదర్శన పి జి తిలక్ ఆర్ట్సు విజయవాడవారి గాంధీనగరం ఉత్తమ నటుడు సమాధానం కావాలి లో ఏకలవ్య పాత్రధారి యం సంజీవి ఉత్తమ ద్వితీయ నటుడు గాంధీ నగరం లో రాజా పాత్రధారి ఎ హృదయరాజు ఉత్తమ నటి గాంధీనగరం లో సుశీల పాత్రధారిణి శ్రీమతి ఆలపాటి లక్ష్మి ఉత్తమ ద్వితీయ నటి సంఘంతో సవాల్ లో సీత పాత్రధారిణి శ్రీమతి జానకి ఉత్తమ విలన్ సమాధికట్టాం చందాలివ్వండి లో సూరయ్య పాత్రధారి శ్రీ పి యస్ రావ్ క్యారెక్టర్ యాక్టర్ సమాధికట్టాం చందాలివ్వండి లో ఇన్నయ్య పాత్రధారి శ్రీ కె వి శాస్త్రి క్యారెక్టర్ యాక్ట్రెస్ వల్లకాడు లో మాణిక్యం పాత్రధారిణి కుమారి సుజాత ఉత్తమ హాస్యనటుడు గాంధీనగరం లో శాస్త్రి పాత్రధారి శ్రీ జె సదాశివరావు ఉత్తమ దర్శకుడు సమాధానం కావాలి దర్శకుడు శ్రీ ఎ శివరామరెడ్డి ఉత్తమ రచన సమాధానం కావాలి రచయిత శ్రీ యం ఎస్ రావు

నాటికలు ఉత్తమ ప్రదర్శన నవోదయ ఆర్ట్సు హైద్రాబాదు వారి దారితప్పిన ఆకలి ఉత్తమ ద్వితీయ ప్రదర్శన ఎ ఆర్ క్లబ్ డ్రెమటిక్ అసోసియేషన్ చిలకలూరిపేటవారి మనుషులొస్తున్నారు జాగ్రత్త ఉత్తమ నటుడు మనుషులొస్తున్నారు జాగ్రత్త లో రెడ్డి పాత్రధారి శ్రీ సి హెచ్ మస్తాన్‌రావు ఉత్తమ ద్వితీయ నటుడు దారితప్పిన ఆకలి లో కవి పాత్రధారి శ్రీ ఎ వెంకటేశ్వరరావు ఉత్తమ నటి అసుర సంధ్య లో రావులమ్మ పాత్రధారిణి రత్నకుమారి ఉత్తమ ద్వితీయ నటి రేపటి మనిషి లో భారతి పాత్రధారిణి బి ఉమ ఉత్తమ విలన్ సమాజం చావనివ్వదు'లో చలపతి పాత్రధారి శ్రీ ఎ యస్ ఆర్ స్వామి క్యారెక్టర్ యాక్టర్ ఈ శవాల్ని పీక్కుతినండి లో వెంకటాద్రి పాత్రధారి శ్రీ యం దివాకర్ ఉత్తమ హాస్యనటుడు 'దారి తప్పిన ఆకలి'లో జ్యోతిష్కుడు పాత్రధారి శ్రీ యం భజరప్ప ఉత్తమ దర్శకుడు దారితప్పిన ఆకలి దర్శకుడు శ్రీ డి యస్ యస్ మూర్తి ఉత్తమ రచన కళ్ళుతెరవండి రచయిత శ్రీ ఎ యస్ రావు

[ఒ ౧] ★

ముద్ద బంతి పువ్వు లో మురళీమోహన్ ఈశ్వరరావు





# అర్ధాంగుల ఆర్థిక సూత్రాలు!

(గత సంచిక తరువాయి)

### నాలుగో సూత్రం

వస్తువులు బేరం చేసే కొనాలి! బేరాల సంగతి మగవారికి విడిచిపెట్టరాదు

భార్య లందరు సాధారణంగా ఇల్లా ఆలోచిస్తారు "భర్తలనే వాళ్ల నొక్కళ్లనీ బజారుకు పంపిస్తే, వీళ్లని మోసం చెయ్యడం కోసమే అక్కడ షాపులు తెరుచుకూర్చున్నవాళ్లు వీళ్లని మోసం చేస్తారు కనుక భార్యలే ఇంటికి కావల్సిన వస్తువులు కొనాలి అల్లా అని భర్తలని ఇంటి దగ్గర వదిలి వెళ్లరాదు ఎందుకంటే ప్రతి భర్తకి సాధారణంగా రెండు చేతులుంటాయి చెరో చేత్తో చెరో సంచి మొయ్యగలిగిన భర్తలతో వెళ్తే, ఇంటికి కావలసిన కూరలన్నీ లేక సరుకులన్నీ ఒకేసారి ఇంటికి తెచ్చుకోవచ్చు కూలీల బెడద ఉండదు"

మీరు మీ ఆవిడ వెంట కూరల బజారుకు వెళ్లారనుకొందాం అప్పుడు మీ ఆవిడ చూపించే పొదపరితనానికి ఒక ఉదాహరణ చెప్తాను

మీరు టొమేటాలు కొందామని వెళ్లారు మీ ఆవిడ "కిలో ఎంత ?" అని అడుగుతుంది దానికి జవాబుగా అమ్మే మనిషి "రూపాయి ఇరవై పైసలు" లంటుంది మీ ఆవిడ "రూపాయి చేసి ఇయ్యి" అంటుంది ఆ మనిషి "కిట్టదు" అని చెప్తుంది ఓ అయిదు నిముషాలపాటు ఈ విధంగా బేరాలయ్యాక రూపాయి పదిహేను పైసలకి బేరం తెగుతుంది అప్పుడు మీ ఆవిడ మీకేసి విజయ గర్వంతో చూసి ఆ పైన ఆ మనిషితో "పావుకిలో యియ్యి" అని చెప్పి తీసుకొంటుంది తీసుకొన్నాక కూరలమ్మే మనిషికి ఎంతివ్వాలో, మూడుసార్లు లెక్క కట్టబోయి తెగక మిమ్మల్నడుగుతుంది మీ ఆవిడ మీరు టపీమని ఇరవై యెనిమిది ముప్పావ్ పైసలని చెప్తారు మీ ఆవిడ అప్పుడు ముప్పై పైసలు తీసి ఆ మనిషి కిచ్చి "పైసియ్యి" అంటుంది ఆ మనిషి "చిల్లర లేదు" అంటుంది మీ ఆవిడ లక్కడ్నుంచి అయిష్టంగా కదుల్తుంది

మీకు వేపకాయంత వెర్రి ఉంటే "ఇంతసేపూ మనం బేరం చేసిందెందుకుట ?" అని అడుగుతారు "మనం మొదటి కూర బేరమాడకుండా కొంటే రెండోదానికి మూడోదానికి వాళ్లు ఇష్టమొచ్చినంత చెప్తారు ఇంత చిన్న విషయాలు కూడా తెలియవేం మీకు ?" అని ఆవిడ మీకు చీవాట్లు పెడ్తుంది మీరు నాలిక్కరుచుకొని మర్నాడు డిస్పెన్సరీకి వెళ్లి మందు వేయించుకొంటారు

### అయిదో సూత్రం

డబ్బు దగ్గరుంటే ఖర్చవుతుంది ఉన్నది చిల్లరగా ఉంటే మరింత తొందరగా ఖర్చవుతుంది!

అంటే మనం మన డబ్బుని బాంకులోంచి తీయరాదు తీసినా బయటికి వెళ్లేటప్పుడు ఇంట్లో పెట్టి వెళ్లాలి చిల్లరగా యెప్పుడూ తీసుకు వెళ్లరాదు

ఈ సూత్రంతో మీరు ఏకీభవిస్తారుకూడాను కాని అది మీ ఆవిడ అమలు పెట్టే విధానమే మీకర్థమై చావదు దానికి మీ రావిడను అనుకోడం తప్ప మీకర్థం కాకపోడానికి మీరే బాధ్యులు అయితే ఈ వ్యాసాన్ని మీలాంటి నాలాంటి వారికోసం వ్రాస్తున్నాను కనక ఎంతో కష్టపడి నేను అర్థం చేసుకొన్న ఈ సూత్రాన్ని రెండు ఉదాహరణలిచ్చి మీ కర్థమయ్యేలా చెప్తాను

మీరు, మీ ఆవిడ కూరల మార్కెట్టుకు వెళ్తారు అక్కడ ముందస్తుగా మీ ఆవిడ రూపాయి నలభై పైసలుపెట్టి బంగాళదుంపలు కొంటుంది చిల్లర ఉంటే త్వరగా ఖర్చవుతుందని ఆవిడకు తెలుసును అందుకని ముందర ఆ చిల్లర్ని వదుల్చుకోవాలని తాపత్రయపడుతుంది కాని ఫలితంగా ఒక అర్ధరూపాయి, రెండు పావలాలు, నాలుగు పది పైసల నాణాలు తీసి ఆవిడ ఆ కొట్లో ఇస్తుంది ఆ విధంగా తీసుకువెళ్లిన చిల్లర తొందర్లో ఖర్చయి పోతుంది అంటే పై సూత్రం మరోసారి ఋజువైందన్నమాట మీ ఆవిడ ముందు కూరల సంచీ మోసుకొంటూ వెనకాతల మీరు మార్కెట్టు బయటికి వచ్చాక మీ ఆవిడకి పదిపైసల పచ్చిమిరపకాయలో, అణా అల్లమో కావలసి వస్తాయి ఆవిడ తిరిగి లోపలికి వెళ్లి కావలసింది కొని పదిరూపాయల నోటు బయటికి తీస్తుంది అమ్మే మనిషిదగ్గర చిల్లరుండదు మీ ఆవిడదగ్గర ముందరే లేదు పక్కకొట్లోవాళ్లు ఇవ్వరు ఆఖరికి ఎల్లాగైతేనేం ఆవిడ తన కిష్టమైన చామదుంపలు మరో కిలో వేరే షాపులో కొని చిల్లర సంపాదిస్తుంది "ఆ పది రూపాయలు ఏం బంగాళా దుంపలు కొన్నచోట మారిస్తే పోలా ?" అన్నట్టుగా మీరు నవ్వుతారు "కొబ్బరికాయ పచ్చడిలోకి పచ్చిమిరపకాయలు మీ కిష్టమని కొన్నాను గాని నాకోసం కాదుకదా! అవి కొనకుండాపోతే అసలు పది రూపాయలు మార్చాల్సిన అవసరమే రాకపోను" అంటూ ఆవిడ మూతి విరుస్తుంది

మీరు మీ అమ్మాయి లిద్దరికి గౌన్లు కొందాం అనుకొంటారు గౌను ఒక్కంటికి ఇరవైరూపాయల చొప్పున రెండు గౌన్లకి నలభైరూపాయలని లెక్కకట్టి ఆపైన రిక్షా ఖర్చులకి కాఫీ ఖర్చులకి మరో అయిదు రూపాయలు అదనంగా అంచనావేసి మొత్తం నలభైఅయిదు రూపాయలు బీరువాలోంచి లెక్కపెట్టి తీసుకొని బీరువాకి భద్రంగా తాళం వేస్తుంది

బజార్లో రెండు గౌన్లు చేరి నలభైయెనిమిది రూపాయ లవుతాయి మిగతా గౌన్లు మన్ననన్నా మన్నవు, బాగుండనన్నా బాగుండవు కొంటే ఈ రెండే కొనాలి ఆ విషయంలో మీఆవిడకి స్పష్టమైన అభిప్రాయా లున్నాయి డబ్బు చాలనందుకు మీఆవిడ చిన్నబుచ్చుకొంటుంది అనుభవజ్ఞులైన మీరు ఎందుకైనా మంచిదని చెక్‌బుక్ తీసుకువెళ్లనే వెళ్లారు మీ మొహం, నామొహం చూడగానే ఏ షాపువాడైనా మనం దొంగచెక్కు లివ్వగలిగిన ధైర్యవంతులం కామని గ్రహించేస్తాడు అందుకని "చెక్కు తీసుకొంటావా ?" అని అడిగితే "తప్పకుండాను" అంటాడు సరిగ్గా అలాంటి సమయంలో మీఆవిడకి ఎన్నాళ్లనుంచో కొందామనుకొంటున్న దుప్పట్లు కనిపిస్తాయి "ఎల్లాగో రిక్షా డబ్బులు దండగపెట్టాం మరోసారి దుప్పట్లకోసం పెట్టడం ఎందుకు ? యీ దుప్పట్లిప్పుడే తీసుకోనా ?" అని మాటవరుసకి మీ అనుమతి అడిగి, మీరు గంగిరెద్దులాగా తలూపగానే ఆవిడ అవి కొనేస్తుంది ఆపైన కర్టెన్లు, టేబుల్ క్లాతులు, చివర్లో ఎన్నాళ్లబట్టీ కుదరక యీరోజున తన కళ్లబడ్డ మాచింగ్ రవికగుడ్డ కొనేస్తుంది

ఏమిటీ! యీ అయిదో సూత్రం తప్పంటారా ? అందుకనే మీఆవిడ మిమ్మల్ని "మీరుత్త అమాయకులండీ" అంటుంది మీరు డబ్బుని దగ్గరుంచుకోకుండా బాంకులో వుంచబట్టేకదా యీరోజు మీరు చెక్కు యిచ్చి అప్రతిష్టపాలవకుండా కాపాడుకొన్నారు!

### ఆరో సూత్రం

ఆర్థిక విషయాలలో అంతిమ విజయం అర్ధాంగులదే!

మీ ఉద్దేశంలో మీ జీతం అనంతమైనదికాదు ఒక నిర్ణీతమైనది కనుక ఏ నెలలోనైనా మీ జీతంలో కొన్నే వస్తాయి ఎన్నో రావు! కాని మీ ఆవిడ కీవిషయంలో వేరే అభిప్రాయం వుంది, "మగవాడికి మనసుండాలేగాని భార్యలకి ఏద్దైనా కొనటానికి, ఎక్కడికైనా తీసుకువెళ్లటానికి మార్గమే వుండకపోతుందా ?" అని

మీరు మీ అత్తవారింటికి, కొన్ని వందలు, రైళ్ళ మొహానా బస్సుల మొహానా, పోసి వెళ్లి రాగలిగారు ఆ యాత్రలో మీ అత్తవారు మీ ఆవిడకో చీర కొన్నారు దాని కావిడ తెగమురిసిపోయి, మీ పక్కింటి వనజగారితో "నేను కట్టుకొనే చీరలన్నీ మా పుట్టింటివారు పెట్టినవే!" అంటుంది పక్క గదిలో వున్న మీ మనస్సు చివుక్కుమని ఆరాత్రి "నువ్వీ నెల మీ యింటికి వెళ్లక తప్పదంటే వెళ్ళొచ్చాం అవునా ? ప్రయాణానికి ఖర్చుపెట్టిన డబ్బుకి అటువంటి చీరలు నాలుగొచ్చును" అంటారు

## అర్ధాంగులు ఆర్థిక సూత్రాలు

దానికావిడ "మిమ్మల్నే నమ్ముకుని, మావాళ్లని వదిలేసుకొని వచ్చిన నేను ఏడాదికోసారి మా అమ్మా నాన్నలను చూడటానికి వెళ్లటం మీ దృష్టిలో ఘోరాపరాధం" అంటూ ముక్కెగబీలుస్తుంది "అదేంలేదు చిట్టీ! ప్రయాణాలు, చీరలు ఒక నెలలో కుదరవన్నాను అంతేగాని మీయింటికి వెళ్లొద్దనలేదు" అంటూ నచ్చచెప్పబోతారు

"ఎందుక్కుదరదు? మీ సిగిరెట్లకి డబ్బుంటుంది మీ పిల్లలకి కొండమీద కోతిని కొనడానికి డబ్బుంటుంది నా కేదైనా కొనాల్సివచ్చేసరికి మీకుండదు మీకు చేతకాకపోతే ఆ డబ్బులేవో నాకివ్వండి ఇల్లు నేను నడుపుతాను" అనేస్తుందావిడ

ఆ సమయంలో "నా జీతం తెచ్చి నీ దోసిట్లో పోస్తాను ఇల్లు నువ్వే నడుపు" అంటారు

అంతిమ విజయం ఎవరిది? అర్ధాంగులదే!

(అయిపోయింది)




## డాక్టర్ సలహాలు

— డా॥ కె. వెంకటేశ్వరరావు

సి యస్ పి — నిర్మల్

నా తల వెంట్రుకలు కుదుర్లోకి వూడిపోవుచున్నవి నెల రోజులనుండి యిలా వుండటమువల్ల తల కొంత భాగము బట్టతలగా అయినది కొన్ని రోజులకి మొత్తము తల బట్టతలగా అవుతుందేమోనని భయముగా వున్నది జుట్టు వూడటము తగ్గాలంటే ఏమి చెయ్యాలి?

★ వెంట్రుకలు వూడటానికి కారణాలు, నివారణ యిదివరకు ఎన్నోసార్లు వ్రాశానుగా, మీలాగే యెందరో యీ ప్రశ్న పదే పదే వ్రాయటం వల్ల — అటువంటివారి దృష్టి పాత పత్రికలవైపు మళ్లించటమే యీ వుత్తరం వ్రాయటంలోని ముఖ్యోద్దేశం! దయచేసి పాత పత్రికలు చూడండని, తిరిగి ఎవరూ యీ ప్రశ్నని వ్రాయవద్దని నా మనవి!

టి వి ఆర్ — కోటబొమ్మాళి

నా వయస్సు 22 సం లు పుట్టుకతోడనే నా కుడికంటికి నొసలు భాగమునందు అర్ధరూపాయంత తెల్లని మచ్చ వున్నది చాలా అందవికారముగా వున్నది అందరూ పుట్టుమచ్చ అంటున్నారు ఈ మచ్చ తొలగించే మార్గము వున్నదా?

★ తెల్లని మచ్చలనేవి యెన్నిఅయినాసరే, యెక్కడవున్నాసరే — అవి పుట్టుకతోనే యేర్పడి వుంటే వాటిని "విటిలైగో" అని వుంటారు

ప్రస్తుతం, భారతీయ జాతీయ వైద్య విధానాల పునఃపరిశోధన సంస్థ, (సి సి ఆర్ ఇ ఎం హెచ్) న్యూఢిల్లీ, దేశమంతటా వున్న దాని విభాగాలు, నిరూపించిన (బడుతున్న) ఒక పైపూత మందు బాగా పనిచేస్తున్నదని, కొన్ని రోజుల క్రితమే వెల్లడయిన సంగతి ఢిల్లీలో యీ సంస్థ విలాసం — ఇ 25 — డిఫెన్సు కాలనీ — న్యూఢిల్లీ వీరికి వ్రాస్తే మీకు దగ్గరలో వున్న వీరి విభాగం — అడ్రసు దొరుకుతుంది

వై ఎమ్ ఆర్ — కొత్తపేట

నా ముక్కుమీద నల్లని పొడ వున్నది సుమారు 5 నెలలనుండి వున్నది ఇది మొఖమంతావ్యాపించేటు వున్నది దీనికేమైనా మందు తెలియజేయండి

★ నల్లని పొడ కొన్ని నెలల క్రితం మాత్రమే ఏర్పడి పెరుగుతూ వుండటాన్ని చర్మ వైద్యులు ప్రత్యక్షంగా పరిశీలించి, చర్మంలో సూక్ష్మక్రిములు మొదలయినవి వున్నవా లేవా అని కనుగొనటం తదనంతరం చికిత్స ప్రారంభించటం అవసరం

ఇంతలోగా 'కెనలాగ్ — ఎస్' పైపూతగా వాడటం, "రెడాక్సాన్" లేక "సెలిన్" 500 మి గ్రా రోజుకి ఒకేమారుగా మాత్రల రూపంలో లోనికి తీసుకోవటం మంచిది

ఎస్ ఎమ్ ఎన్ — హైదరాబాద్

5 సం ల క్రితం కొత్తచెప్పులు వాడిన ఫలితంగా రెండు కాళ్ళపై బాగా పుండ్లుపడ్డాయి చూడ్డానికి చాలా అసహ్యంగా వుంటున్నవి కొంచము దురద వుంటుంది మందులు వాడితే చీముకారుట తగ్గిందిగాని పుండు మానటంలేదు దీనికి నివారణోపాయం తెలియజేయండి

★ కొందరికి, కొన్నిరకాల తోళ్లతో తయారు చేసిన పాదరక్షల వల్ల — ఇలా రావటం జరుగుతున్నది ఎక్కువగా, "ప్లాస్టిక్" — "పాలిథీన్" కొన్ని జంతువుల చర్మాలు పాదరక్షల తయారీలలో వుపయోగింపబడినప్పుడు అది వాడినవారికి "అలర్జీ" అంటే శరీరం దాన్ని సహించకపోవటం ద్వారా, ఆచోట కురుపులు, దురద, పుండ్లు మొదలయినవి ఏర్పడటం జరుగుతుంది దీనికి ఆ పాదరక్షలు వాడకం పూర్తిగా మానటం, చర్మానికి "కెనలాగ్ — ఎస్" స్కిన్ ఆయింట్‌మెంటు వ్రాస్తే తగ్గుతుంది

ఎస్ వి కె — పేటూరు

నా కుమారుడు పుట్టిననాటినుండి నేటివరకు వృషణములు బయటకు కన్పించుటలేదు ఇప్పుడు ఏడవ సంవత్సరము ఏడ్చినపుడు లింగమునకు ఇరుప్రక్కల వాపుమాదిరిగా కన్పించును తరువాత మామూలుగా వుండును దీనికి కారణమేమిటి? దీనికి చేయవలసిన వైద్యము తెల్పండి

★ ఇలా వుండటాన్ని "అన్ డిసెండెడ్ టెస్టిస్" అంటారు ప్రతి శిశువుకీ తల్లి గర్భంలో వుండే సమయంలో ఈ రెండు వృషణాలూ కడుపు లోపల వుంటాయి తల్లికి 6 వ నెల రాగానే, గర్భంలోని శిశువు యొక్క వృషణాలు క్రమంగా కడుపు (పొట్ట) గోడలోని ఒక కాలువ ద్వారా వృషణాల ప్రకృతిసిద్ధమైన సంచీలోకి లాగబడతాయి ఇలా జరగకపోయినా, మార్గావరోధం ఏర్పడినా, పైన మీరు వ్రాసినట్లు జరుగుతుంది ఏడ్చినప్పుడు "వాపు" కనబడటం "కాలువ" వున్నదనీ ఏదో యితర మార్గావరోధాలు వుండి వుంటాయని తెలియజేస్తుంది శస్త్ర వైద్యుల సలహామీద వారు చెప్పినట్లుగా శస్త్రచికిత్స చేయిస్తే మామూలు పరిస్థితి ఏర్పడుతుంది

ఎమ్ ఎల్ ఎస్ — హైదరాబాద్

మలవిసర్జన చేసేటప్పుడు శబ్దము ఎందుకు వస్తుంది దీనికి కారణము, నివారణోపాయము తెలుప ప్రార్థన

★ ఆహారంతోబాటుగా కొంచెంగా గాలిని కూడా మనం లోపలికి మింగటంవల్ల, జీర్ణకోశంలోకి యీ వాయువు ప్రవేశిస్తుంది ఈ గాలి కడుపులో ఆహారం వున్నంతసేపు వుండి, కొంత ప్రేవుల ద్వారా బయటికి రావటం జరుగుతుంది

చిన్న ప్రేవులు, పెద్ద ప్రేవులలో ఆహారంతో బాటుగా యీ గాలి పయనించి, చివరికి మలవిసర్జన సమయంలో వెలుపలికి వేగంగా ఎక్కువ పీడనశక్తితో విసర్జించే సమయంలో యీ శబ్దంవస్తుంది

ఇది సర్వసాధారణము, ప్రకృతిసిద్ధము అయినందువల్ల, నివారణ అనే ప్రశ్న అసలు ఎందుకు వస్తుంది??

**పాడవోయి భారతీయుడా !**

ప్రముఖ చిత్ర నిర్మాత డి బి నారాయణ, ప్రముఖ వ్యాపారవేత్త వడ్డే రమేష్‌గార్లు విజయ భాస్కర్ ప్రొడక్షన్స్ పేరిట నిర్మిస్తున్న "పాడవోయి భారతీయుడా" చిత్రం మొదటి షెడ్యూలు పూర్తయింది

**మూడు మతాల కథ**

గడుసరి కథ రాసి, మాటలను సమకూర్చి, చిత్రానువాదం నొనరించి, దర్శకత్వం నిర్వహిస్తూన్న "పాడవోయి భారతీయుడా" చిత్రం మూడు మతాల ప్రతినిధులకు సంబంధించిన సహజ సంఘటనల హారం అనేడి నిజాన్ని దాసరి చెప్పారు

మూడు మతాల ప్రతినిధులుగా సత్యనారాయణ (ఇస్లాం), కాంతారావు (హిందు), త్యాగరాజు (క్రైస్తవం) నటిస్తున్నారు ఈ చిత్రానికి వి ఎస్ ఆర్ కృష్ణారావు ఛాయను, జి జి కృష్ణారావు కూర్పును నిర్వహిస్తున్నారు

దాసరి మహదేవన్ కలిసి పని చేస్తున్న మొదటి చిత్రం కూడా యిదే

**శ్రీదేవి ఈశ్వరరావు**

"పాడవోయి భారతీయుడా" చిత్రంలోని నాయికా నాయకుల పాత్రలను శ్రీదేవి, ఈశ్వరరావు పోషించ, అల్లు రామలింగయ్య, మాడా, రమాప్రభ, గిరిజారాణి సహాయ పాత్రలను నిర్వహిస్తున్నారు

డి బి నారాయణగారి చిత్రం విజయా పిక్చర్స్‌లో విడుదల కావడం యిదే ప్రథమం లోగడ చిత్రాలన్నీ శ్రీ ఫిలింస్ విడుదల చేసింది

## సినిమా

(27వ పేజీ తరువాయి)

**పొగరుబోతు**

అనిల్ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న వర్ణ చిత్రానికి "పొగరుబోతు" అని పేరు పెట్టినట్లు, కథకుడు—దర్శకుడు తాతినేని ప్రకాశరావు చెప్పారు

ఈ చిత్రానికి భమిడిపాటి మాటలను, మహదేవన్ సంగీతాన్ని సమకూర్చ, ఛాయకు వెంకటరత్నం, కళకు సూరన్న ఆధిపత్యం వహిస్తున్నారు

**భర్త నాస్తికుడు. భార్య భక్తురాలు**

"పొగరుబోతు" పాత్రధారి శోభన్‌బాబు నాస్తికుడుగా (పరిస్థితులు అలా చేశాయి), ఆయన సహధర్మచారిణి భక్తురాలుగా వాణిశ్రీ పోటాపోటీ పాత్రలను పోషిస్తున్నారు సహ పాత్రలను సత్యనారాయణ, గుమ్మడి, రాజబాబు, నిర్మల, సూర్యకాంతం పోషిస్తున్నారు

"హీ—మాన్"కు బాగా నచ్చిన పాత్రల్లో "పొగరుబోతు" ఒకటి ఆయనకు యీ పాత్రపైన, చిత్ర విజయంపైన పెద్ద హోప్ వుంది తారకరామ ద్వారా విడుదలయ్యే "పొగరుబోతు" చిత్రాన్ని టి ఎల్ వి ప్రసాద్ నిర్మిస్తున్నారు

**కృష్ణుడు హీ-మాన్**

కురు, పాండవ యుద్ధానికి కారణభూతుడైన జగన్నాటక సూత్రధారి శ్రీకృష్ణుడు పాత్రను పోషించడానికి హీ—మాన్ అంగీకరించిన నిజాన్ని, ఆయనే చెప్పారు "కురుక్షేత్రం" వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్న "పాండవవనవాసం" ఫేమ్ ఆంజనేయులు గారికి శోభన్‌బాబు కృష్ణ పాత్రకు సమ్మతిని తెలిపారు

యావద్భారతం గర్వించదగ్గ పంథాలో "కురుక్షేత్రం" చిత్ర నిర్మాణం జరుగగలదని, వెండితెర అతిరథులు అనేకులు ప్రధాన పాత్రలను పోషించగలరని, కృష్ణ పాత్రధారి చెప్పారు

కృష్ణ పాత్రపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించి, ఆ పాత్రలో ఒక ప్రత్యేకతను తెచ్చేందుకు, శోభన్ నిర్ణయించారు "విష్ హిమ్ ఆల్ ది బెస్ట్"

**మహేష్ ఎంటర్‌ప్రైజస్ !**

ఈ సంస్థకు కె మహేంద్ర అధినేత ఈయన సుభాషిణి ఆర్ట్ పిక్చర్స్‌లో ప్రముఖ పాత్రను నిర్వహిస్తూ, దర్శకుడు హేమాంబరధర రావుకు కుడిభుజంగా వ్యవహరిస్తూ, అన్నిశాఖల్లో అనుభవం సంపాదించారు

మహేష్ ఎంటర్‌ప్రైజస్ తలపెట్టిన చిత్రానికి హేమాంబరధరరావును దర్శకునిగా ఎంపిక చేసినట్లు, కథకుడు నిర్మాత మహేంద్ర చెప్పారు

ఈ చిత్రంలో సత్యనారాయణ, చంద్రమోహన్, రాజబాబు, గిరిబాబు ప్రధాన పాత్రలను పోషిస్తారు నాయికా, నాయకులుగా జయచిత్ర, మురళీమోహన్ నటించగలరు

ఈ చిత్రం షూటింగు ఆగస్టునుంచి ఆరంభమవుతుంది అనుభవజ్ఞుడు ఆరంభిస్తున్న యీ ఆరంభ చిత్రానికి ఆంధ్ర ప్రేక్షకుల ఆదరణ లభించగలదని ఆశిద్దాం — శ్రీనివాస

ఎ సి. కె ఎమ్. ద్రోణాచలం

జాతి, మత, కుల బేధాలు లేవు అంటూనే ప్రత్యేక కులాలు అంటున్నారు అలాంటి పరిస్థితిలో మాలాంటి నిరుద్యోగులు, ఇతర జాతివారి గతి ఏం కావాలి ?

ఇతర జాతి కూడా ప్రత్యేక జాతిగా మార్పించు కునే ప్రయత్నం — మీ నాయకులు చెయ్యాలి షెడ్యూల్డు చేయించుకోవాలి మా కులాన్ని లిస్టులో చేర్చండి అంటూ అప్పుడప్పుడు అర్జీలు వినడం లేదా ? !

బి ఆర్. డి సికింద్రాబాదు

ఇంట్లో వాడించేటప్పుడు తమతో ఏకీభ విస్తే సరేసరి, లేకుంటే యీ పెద్ద లెందుకు అంతగా మండి పడతారు ?

చిన్నవాళ్ళలో ఏకీభవించవలసి వచ్చినందుకు చిట్లేతల్లి 'యు ఆర్ రైట్' అని ఎదుటి వారి ననడానికి కూడా మానసికవున్నత్యం కావాలి

కె వి బి. కె ఖమ్మం

మీ ప్రశ్నావళి పత్రిక పేజీల్లో ఎక్కడ జాగా దొరికితే అక్కడ చేరుతుంది అయినా త్రిప్ప కుండానే ఆ పేజీ వస్తుంది బహుశా ఆ మహత్యం మీ జవాబుల్లోని ఇంద్రజాలం (షార్ప్‌నెస్) అనుకోవచ్చు చాలా మంది మీ జవాబులు చదివి కొందరు విపరీతమైన కోపాన్ని వెళ్ళబుచ్చుతారు సహజం మీ క్వాలిఫికేషన్ ?

తినలేని ముద్ద ముందు తినెయ్య'అని తల్లి గోరుముద్దలు పెట్టినట్టు అలాగ్గా యిష్టం లేనిది ముందు చదివేస్తే తీరి పోతుంది'అని చాలా మంది ఉద్దేశ్యం పాఠకుల కోపతాపాలకి అతీతా రాల్నినేను. వారికేం నచ్చితే అదే రాయాలను కొందుకు నేనేం తెలుగు సినిమా నిర్మాతనా?! నాకు ఖచ్చితమైన అభిప్రాయాలున్న విషయాలలో

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

జంకను ఎలాంటి విషయాల జోలికి పోను అయినా కోపం ఎందుకొస్తుంది ? ఒక్కక్షణం ఆలోచించండి నిజాన్ని ఎదుర్కోవలసి వచ్చినప్పుడు ? అవునా ? !

ఎమ్ సి కె. వై విజయవాడ

జీవితం స్వర్గతుల్యం చేసుకోవాలంటే ఏమి చెయ్యాలి ?

ఆశను జయించాలి అది సాధ్యం కానిపని. అంచేత ఈ జీవితం జీవితంలాగే వుంటుంది కాని స్వర్గం కాదు నరకం కాదు

పి ఎస్ ఎమ్. విజయవాడ.

మీకు పునర్జన్మ మీద నమ్మకం వుందా ?

ఏదో సామెత చెప్పినట్టుంది ఈ జన్మ గడిచేదెలాగో తెలలేదు యింకో జన్మని గురించి ఆలోచన ఎందుకు ? వెనకటికి మహాజ్ఞాని ధోరో ని మరణాంతర జీవితం మీద నీ నమ్మకం ఏమిటి ?' అని అడిగారట దానికాయన అసహనంగా ముందు ఒక ప్రపంచాన్ని గురించి ఒకసారి అడగండి అన్నాట్ట. అలాగ్గా వుంది మీ ప్రశ్న.

ఎస్ ఎస్. ఎన్. బి. బొంబాయి

మీరు మరి పురుషుల మీద అభిమానం చూపటం లేదు ప్రశ్నావళి మానివేయవలెను

నిత్యం తమలాంటి వారంతా ఆడవాళ్ళ మీద దయ, జాలి చూపించేసి చంపుతున్నారని అభి మానించనా ? లేక ఆడది మనిషే కాదు దానికీ సంఘంలో స్థానం ఏమిటి తోసి పారెసెయ్యండి లంటూ ఆవేశ పడి పోతున్నారని అభి మానించనా ? చూడండి బాబుగారూ, నేనో 'రొంగాడ రచయిత్రి'నై వుంటే మీ పురుషుల బావాలకి చప్పట్లు కొట్టే దాన్నే కాని నేను సిసలైన ఆడదాన్ని అంచేత కాస్త పౌరుషం ఏడి పిస్తూంటుంది ఆడదాన్ని లోకువగా చూసే మగవాళ్ళపట్ల అభిమానం ప్రకటించడానికి.

ఓ. వి ఆర్ విశాఖపట్నం

బస్సులో సీటు యిస్తే ఎందుకూర్చోరు ? ఒక పక్కన సమాన హక్కులంటూ ?

బస్సులో అబ్బాయి సీటు ఆఫర్ చేసినప్పుడు 'ఫరవాలేదు మీరే కూర్చోండి'అని ఏ ఆడదైనా అంటే ముసలితనం ముంచు కొస్తున్నట్టు బాధ పడతారు మగవాళ్ళు ! సమాన హక్కులకి, మగ వారు చూపే షివల్రీకి సంబంధం ఏమిటి ? సమాన హక్కులిచ్చినంత మాత్రాన్న ఆడదంటే ఆదరణ పోవాలా ? గౌరవం పోవాలా ? అక్కర్లేదు !

సి. కె వి కరీంనగరు

స్త్రీ లేనిదే పురుషుడు బ్రతుక గలడా ?

ఆ అసంతృప్తిగా, విసుగ్గా, విరాగా ఎవరికీ అక్కరలేని గాలిపటంలాగా

వి. ఆర్. ఎమ్ కొట్టాం

నా భార్యకు నేను వివాహ శుభ సమయమున మూడు ముళ్ళువేసి బ్రస్తే కట్టాను మరి అది నాకు లొంగి జీవితాంతం బానిసగా వుండాలంటారా. మరి మూడు ముళ్ళ రహస్యం ఇదే కదా

మరి మూడు ముళ్ళ వెనక బానిసత్వం వుంటే పాదంపట్టి చుట్లు పెట్టేవది మీరు కదా ! దాని కద ఏమిటి? ఆమె పాదం పట్టుకున్న మీరు బానిస కారా ?!

# వెలుగు బాట

(11 వ పేజీ తరువాయి)

నిజంగా నా దురదృష్టం అయితే — కవి, శిల్పి, చిత్రకారుడు ఒకటై తయారుచేసిన సుందర స్వరూపమైన మిమ్మల్ని పొంద గలిగితే మాత్రం నేను అదృష్టవంతుణ్ణనే భావిస్తాను ! నా మనసులో గూడుకట్టుకున్న ఈ కోరికను ఎప్పటికప్పుడు మీకు తెలియ చేద్దామనే అనుకుంటాను. కాని — మీరు కనిపించి, మీతో మాట్లాడినంతసేపూ ఏమీ చెప్పలేకపోతుంటాను ! మీరు నాదగ్గరనుంచి వెళ్ళిపోయాక ఆ మధుర క్షణాలని నెమర వేసుకొని కూర్చుంటాను. అందునుంచి నా మనసులో మీ గురించి పెరుగుతున్న అభి ప్రాయాన్ని ఇక్కడ వ్రాస్తున్నాను. సృష్టిలో అతి విలువైనది వివాహబంధం ఒకరి ముఖం ఒకరికి తెలియక బస్సులో కలిసిన ప్రయాణీ కులలాగా, యాంత్రిక జీవితం సాగించే ఆలు మగల వివాహబంధానికి విలువేముంటుంది ? దానిలో స్వారస్యం ఏముంటుంది ? ఆలు మగల అనుబంధం పూవు—తావిలాగా, కన్ను—రెప్పలాగా, నావ—చుక్కానిలాగా ఉంటే ఎంత అందంగా ఉంటుందని ! అందునుంచి భావి జీవితాన్ని ఆనందనందనంగా తయారు చేసు కోవాలని నిత్యం ఆశించే నేను మిమ్మల్ని జీవిత భాగస్వామినిగా చేసికొని ఆనందంగా పువ్వుల పడవలో పయనించాలని ఆశిస్తున్నాను. మీ ఆశలు, ఆశయాలు, అభిప్రాయాలు, వివ రంగా తెలియచేస్తూ వెంటనే సమాధానం చెపుతారుకదూ ?

నా జీవన హర్మ్యానికి తొలి సోపానం కాగ లిగిన మీ సమాధానం కోసం నిరీక్షిస్తున్న

— గోపాలం."

ఉత్తరం చదివి మడిచి తలగడ క్రింద కనిపించకుండా పెట్టేసింది లైటార్పి కళ్ళు మూసుకుంది కాని ఆమె కళ్లకు నిద్ర రాలేదు ఆమె ఆలోచిస్తోంది 'గోపాలరావు కేం సమాధానం ఇవ్వాలి ?' అని కొంత సేపు, 'ఎందుకు సమాధానం ఇవ్వాలి ?' అని మరికొంతసేపు, 'ఎలా సమాధానం ఇస్తే బాగుంటుంది ?' అని ఇంకొంతసేపు 'లప్పు డప్పుడు గోపాలరావు అందమైన విగ్రహాన్ని చూస్తూన్న పుడె అతనిలాటివాడు తనవాడు కావటం అదృష్టంగా భావించకపోలేదు ! కాని—అతనే తనవాడు కావాలనీ, అతడితోనే తను జీవితం సాగించాలని ఎప్పుడు ఆశించ లేదు ఆశలు పెంచుకోలేదు '

'అయితే అతడు తన మీద ఆశలు పెంచు కున్నంత మాత్రాన తను అతని ఆశలకి లొంగిపోవాలని లేదే ?' ఆమె మస్తిష్కంలో

# పిల్లలు త్వరితంగా శక్తి ఖర్చు చేసేసుకుంటారు...

## గ్లాక్సోస్-డి మీకు తక్షణ శక్తిని ఇస్తుంది!

ఆటల తరువాత చదువులపై దృష్టిని కేంద్రీకరించేందుకు కావల్సిన కొత్త శక్తి కలిగి ఉండేలా పిల్లలకు నిమిషాల్లో తాజాదనాన్ని సమకూరుస్తుంది గ్లాక్సోస్ డి. రుచికరమైన గ్లాక్సోస్ డిని పళ్ళ రసంలో లేదా దానంతట దానినే తీసుకోవచ్చు. నిమిషాల్లో మీకు తిరిగి శక్తిని సమకూరుస్తుంది




**గ్లాక్సోస్-డి®** గ్లాక్సోవారి వస్తువు

dCP/GL/31 b Tel

## సామాన్యుని సహాయకుడు

# "తెర మీద దుశ్శాసనిజం"-1

నిండా, పాదాల మీదుగా కుచ్చిళ్లు నేల జీరాడుతూ చీరె కట్టుకున్న అందమైన అమ్మాయి సముద్రపు టొడ్డున కెరటాలలో ఆడుకునేటందుకు కొంచెం రెండంగుళాలు కుచ్చిళ్లు పైకెత్తి పట్టుకుని ముందుకు వంగి కెరింత లాడుతూంటే, తెర మీద ఆ దృశ్యం కనబడితే అది సెక్సప్పీలు. అంటే రెండంగుళాలమేర మాత్రం అమ్మాయి కాళ్లు కనపర్చిందంతే...అలవోకగా పైట జారగా, మెడ క్రిందభాగం కొస్తంత క్రిందదాకా ఎత్తైన చోటుదాకా కనపడితే సెక్సప్పీలు ... కాని చీర మోకాళ్ల మీదకే వుంటె? అసలు పైట వేసుకోకుండాపోతే యింకా లప్పీలేమిటి? పొట్టి లంగా, పైన 'షర్ట్' వేసుకున్న అందాలమ్మాయికి ఆ లంగా గాలికి కొంచెం అలా ఎగురుతూన్నట్లు ,కనపడితే వాలు అదే సెక్సప్పీలు ... అంతవరకు మనకి పిక్కలదాకా కనపడుతూనే వున్నాయామె కాళ్లు. కాని సెక్సప్పీలు లేదు కాని ఆ పిల్ల నట్నుంచి యిటు గిరున తిరగమని, అలా చేసినప్పుడు బుట్టలా లంగా క్షణంలో సగంసేపు ఎగిరితే అదే సెక్సప్పీలు ...

జబ్బలనిండా జాకెట్ తొడుక్కున్న అమ్మాయికి, ఒక్క సెంటీమీటరు మేర బ్లవుజు చేతి అంచులు మడతెడితే; వెనకపక్క పైనున్న ఒక్క హుక్ పొరపాటున వూడినట్లు వూడితే సెక్సప్పీలు...కాని అసలు చీర లేకుండా వుత్త లంగాతో వున్నామెను లంగా పట్టుకుని ఒకడు రాక్షసంగా లాగుతూవుంటే ఆ అమ్మాయి పరిగెడితే ... అప్పీలు గల్లంతు అవుతుంది. బ్లవుజే లేని అమ్మాయి చూపించేది సెక్సప్పీలు గాదు 'సెక్సు' అంటాందాన్ని ఇదంతా ఏమిటయ్యా? అంటే మన సినిమాల్లో సెక్సప్పీలు పేరిట సెక్సును ప్రదర్శించడం జరుగుతున్నదా? లేదా? అన్న జిజ్ఞాస ఒక్కటి కలిగినప్పుడు అనిపించిన సంగతులివి.

గౌను తొడుక్కున్న రీటా కొంచెం పొట్టి గౌను తొడుక్కుంటే చాలు-బోలెడు సెక్సప్పీలు మరి బేతింగ్ సూట్‌లోవున్న నీటు కత్తె ఆ లాగుని ఒక్క పిసరైనా అలా పైకి మడతపెడితే తప్ప సెక్సప్పీలు రాదు ... అంచేత 'సెక్సు' ప్రదర్శన ఎంత చేసినా ప్రేక్షక మహాశయులకు చాలటంలేదు కావున మేము తెరపై పవిత్ర భారతనారీమణులజాతికే చెందిన తారామణులను వస్త్రాపహరణం చేసి చూపెడతాం అని చూపెడుతూ — అయ్యా మీకు చాలటంలేదో అని గోలెట్టే సినీ మహాశయులు ఒక్కసారి ఆలోచించాలి. ఏది సెక్స్? ఏది సెక్సప్పీలు?

లోపలి 'న్యూలుక్ షేప్ బ్రా' బయటకి జాకెట్‌లో నుంచి కనీ కనపడకుండా వుండేనే అది సెక్స్‌ప్పీలు గాని "బ్రా" యావత్తు కెమెరా క్లోజప్‌లోకి వస్తే గుట్టు కాస్తా ...

అయ్యా సెక్స్‌ప్పీలుకి వల్గారిటీకి మధ్య సన్నని గీత ఒక్కటి మాత్రం వుంటుంది దాన్ని దాటిపోకుండా వుండాలన్న పట్టుదల వుండాలేగాని సినిమా వాళ్లకి — వొంటినిండా గుడ్డలు తొడిగి "చూపగల సెక్సప్పీలు" వాటిని వొలిచేసి చేసే "దుశ్శాసనిజం" తో రాదు ... చూపులో పెదవి విరుపులో, బుగ్గ కెంపులో, నడక హొయలులో తీసుకురాగల సెక్సప్పీలుని — మన తారామణుల వంటిమీద నూలుపోగుల శాతం తగ్గించి చూపెట్టడం, వాళ్ల సెక్సప్పీలు టాలెంట్ అంటూ నిలబెట్టడం — ఎక్స్‌క్యూజ్ మి సార్! ఏమాత్రం గుడ్ టేస్ట్ కాదండి! "స్లీవ్ లెస్" బ్లవుజ్ — లో కట్ జాకెట్, లంగా కుచ్చెళ్లు కనపడే చీర అంచుల రెపరెపలు, నిండా కప్పుకొన్న పైట, గాలికి ఎగిరి ఒక్క అంగుళం జారితే కలిగే జివ్వు జివ్వులన్నీ జనం మరిచి పోయేలాగా చేసేశారు సినిబ్రహ్మలు — ఇవాళ అనాటమీ లఫ్ వుమన్ అన్‌ది వైడ్‌స్క్రీన్ చేసేస్తున్నారు...పైగా 'బ్లేమ్' అంతా టిక్కెట్ కొనుక్కొని చూసే వాడిమీద తోసేస్తున్నారు. సెక్స్ అప్పీలు వేరు, సెక్స్ ప్రజంటేషన్ వేరు మహాప్రభో! మా మొరాలకించండి అని గోలెడితే వినే స్థితిలో ఎవరైనా వున్నారా? అని ...

/వీ రా జీ/

# వెలుగు బాట

ఈ రకమైన ఆలోచనలు కొంతవరకూ చెలరేగాయి.

గోపాలరావు నాజూకైన మనిషి.

అతడి ఆకర్షణీయమైన కళ్లు, విశాలమైన ఫాలం, దానిమీద గంతులువేసే నల్లని ముంగురులు, అందమైన ఉంగరాల జుట్టూ, మెరిసినట్లుండే శరీర ఛాయ, తనను ముఖ్యంగా ఆకర్షించే అతని మాటల సౌందర్యం ఆమె కళ్లముందు మెదిలింది! ఎదుట మనిషిని వేగంగా ఆకర్షించే అతని హాస్య ధోరణి. అంటే మొదటి నుంచీ ఆమెకిష్టం. అదే తన స్నేహితులతో అప్పుడప్పుడూ పొరపాటున అనబోయి, వాళ్లు విపరీతార్థాలు తీస్తారేమోనని భయపడి ఊరుకొనేది!

ఇంతకీ—'గోపాలరావు తనని ప్రేమించటంలో తప్పేముంది? అతనికేం తక్కువ? ఆకర్షణీయమైన అందం, తెలివితేటలు, ధైర్యం అన్నీ అతడిలో ఉన్నాయి. మరి గోపాల్రావుని తన వాడిగా స్వీకరిస్తే తప్పేముంది గనుక?' ఇలాంటి ఆలోచనలు మరోసారి ఆమెను చుట్టుముట్టాయి. అప్పుడు ఆమె శరీరం ఒక్కసారి పులకరించింది.



# వెలుగు బాట

ఆమెలో ఆశలు చిగురించిన సమయాన సిగ్గు మొగ్గలు తొడిగింది కోరికలు పెరుగులు తీసాయి ఆనందం ఆత్మీయంగా అల్లుకుంది ఆమె అలా ఆ మధుర భావనా తరంగాలలో ఎంతసేపో తనను తాను మరిచిపోయింది ఊహాలోకాలలో విహరిస్తున్న కృష్ణవేణిని గోడగడియారం పదకొండుసార్లు 'రంగ్, రంగ్' మని మ్రోగి వాస్తవిక జగత్తులోనికి తీసికొనివచ్చింది ! గోపాలరావ్ ఉత్తరంలో వ్రాసిన చివరి వాక్యాలు కృష్ణవేణి హృదయాన్ని బాగా ఆకట్టుకున్నాయి అలాగ ఆలోచిస్తున్నకృష్ణవేణికి తన అక్క గుర్తుకొచ్చి మనసు కలుక్కుమంది దానితో 'గోపాలం తనవాడు కావాలన్న కోరిక' ఆమెలో బలీయమైంది. ఆమెకి తెలియకుండా ఆమెలో గోపాలం చుట్టూ మరిన్ని ఆశలు పెరిగాయి ఆ ఆశలు ఆమెను నిద్రలోనికి లాక్కుపోయి కలలయ్యాయి.

* * *

"కృష్ణా !" అని కేక వేసుకుంటూ, ఇంట్లోకి వస్తోన్న విమల వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటున్న రామచంద్రరావుగారిని చూడగానే వినయపూర్వకంగా నమస్కారం చేసింది. ఆయన ఆశీర్వదిస్తున్నట్లు చేతిని ఎత్తారు.

"కృష్ణ ఏం చేస్తోందండీ ?"

"ఇంట్లోనే ఉందమ్మా. భోజనం చేస్తున్నట్లుంది," అని మళ్లీ, "ఏమమ్మా బర్త్‌డే నన్ను పిలవకుండానే చేసేసుకున్నావే? పోనీ .. బాగా జరిగిందా ?" అన్నారు చిరుదరహాసంతో. అతనంటున్న మాటలర్థం కాలేదు విమలకి. అయోమయంగా చూస్తూ "ఎవరి బర్త్‌డే అండీ ?" అంది.

"అల్లా తెల్లబోతావేంటమ్మాయ్ ? నిన్న నీ పుట్టిన రోజటగా !"

"ఎవరు చెప్పారండీ ?" ఆశ్చర్యంగా అడిగింది విమల

"అదేంటమ్మాయ్. నిన్న నీ పుట్టిన రోజని చెప్పిందే కృష్ణ" అని రామచంద్రరావుగారు అంటున్నంతలో, విమల మాటలు విని, భోజనం త్వరగా ముగించుకొని చేతులు తుడుచుకొని వస్తున్న కృష్ణవేణివంక అయోమయంగా చూసింది విమల కృష్ణవేణికి కాళ్లక్రింది భూమి కదులుతున్నట్లనిపించింది. వెంటనే కృష్ణవేణికి ఓ ఆలోచన వచ్చింది. తండ్రివేపు దృష్టి నేమాత్రం మరల్చకుండా విమలవేపే చూస్తూ, "అదేంటే మొద్దూ ! అలా తెల్లపోతావేం ? నిన్న మీ బాబిగాడి పుట్టినరోజు అంత చక్కగా జరిపికూడా అంత వేగరం మర్చిపోయావేంటే ?" అంది. కృష్ణవేణికి ఏదో కారణంచేత అబద్ధం ఆడాల్సి వచ్చిందని అప్పటికి గ్రహించిన విమల "ఆఁ! నా పుట్టినరోజంటే నా కర్థం కాకుండా పోయిందసలు. మా తమ్ముడు పుట్టిన రోజండీ! బాగా జరిగిందండీ వెధవ .. గొప్ప అల్లరి చేసేసాడు. కృష్ణ దగ్గర మాత్రం గొప్ప చనువు. ఇది లేకపోతే వాడు మమ్మల్నందర్నీ ఏడిపించేసి ఉండేవాడు" అని అబద్ధాన్ని మరికొంచెం

# ర్యాలిఫాన్ డీలక్స్. అన్నిటికన్న మేలైనది కావాలనుకుని, దానికి తగిన ధర ఇచ్చే వాళ్లకోసం ప్రత్యేకంగా డిజైను చేయబడినది.

ర్యాలిఫ్యాన్ డీలక్స్‌లోని ప్రతి భాగమూ సమర్థవంతంగా డిజైను చేయబడి, ఖచ్చితంగా తయారుచేయబడి, పూర్తిగా పరీక్షచేయబడినది. అది ఎప్పుడూ ఉన్నతమైన తీరులో పని చేసేందుకోసం కొత్తగా ఉన్నప్పుడే కాదు—వేలకి వేల గంటల కొద్దీ పనిచేసిన తర్వాత కూడాను

- అపూర్వమైన 'బ్లేడ్ కాంటూర్' వలన ఎక్కువ గట్టిగా ఉండటమే కాకుండా, సమమైన తీరులో చల్లగా గాలి వీస్తుంది
- ఎంతో వీలుగా బాలన్సు చేయబడిన బ్లేడ్లవలన, మోటారు పైన అతిసమానమైన బరువు పడుతుంది. దీనివలన మోటారు ఎక్కువ కాలం నడుస్తుంది
- ఏ కోణంలోనైనా సాఫీగా, నిర్నిబంధంగా తిరిగేందుకు గాను ఖచ్చితంగా అమర్చబడ్డ ప్రత్యేకమైన స్టాండు.
- తేలికైనదీ అయినా స్థిరమైన 'బేస్' స్పీడును సరిచేసేందుకు గాను, తేలికగా, నొక్కుతుంటే చాలు పనిచేసే పియానో కీ స్విచ్‌లు
- ఎంచుకోడానికి 5 రంగుల్లో ప్రత్యేకమైన స్టా ఎనామెలింగ్ మరియు ఇన్ఫ్రా రెడ్ బేకింగ్ పద్ధతితో ఉపరితలాలను పెయింట్ చేయడంవలన, ఏళ్ళతరబడి కొత్తగా కనిపించేలా చేస్తుంది.

అందుకే, మీరు ర్యాలిఫాన్ డీలక్స్‌కు మరికాస్త ఎక్కువ డబ్బు ఇస్తున్నారంటే, నిజానికి మీరు ఉన్నత శ్రేణిలోని నాణ్యతా, ఉత్తమమైన పనివాడితనమూ, శ్రేష్ఠంగా పనిచేసే లక్షణం కోసమూ ఇస్తున్నారన్నమాట.



## ర్యాలిఫాన్

కాలానికి నిలుస్తుంది—ఎంతో అందంగా

U-RTF-17 TEL










# వెలుగుబాట

సాగదీసింది విమల. కృష్ణవేణి గట్టిగా నిట్టూర్చింది.

రామచంద్రరావుగారి కనుబొమలు ముడి పడ్డాయి. వీళ్లిద్దరూ కలిసి ఏదో అబద్ధం ఆడుతున్నట్టు ఆతనికి మనసులో చిన్న అనుమానం చెలరేగింది. అప్పటికి మాత్రం మౌనంగా వూరుకున్నారు. అక్కడింకా నిలబడటం ఆరోగ్యకరం కాదనుకున్న కృష్ణవేణి అక్కడ్నించి వెళ్లి ఆ పూట టైమ్ టేబిల్‌లోవున్న పుస్తకాలు పట్టుకొని "రావే విమలా, కాలేజీకి వెళ్దాం నాన్నా!" అని విమలను తీసుకొని అక్కణ్ణించి కదిలి పోయింది.

అప్పుడే 'కృష్ణవేణికి ఓ మంచి సంబంధం చూసి త్వరలోనే పెళ్లి చెయ్యటం' ఎంతో ముఖ్యం అనిపించింది రామచంద్రరావుగారికి.

* * *

"పోస్ట్." అన్న కేక వినేసరికి కమల విప్పారిన ముఖంతో పరుగుపరుగున వెళ్లి, ఉత్తరాన్ని అందుకుంది. "అమ్మా! కమలమ్మా! మీ బావ కివాళ దయకలిగిందమ్మా. నిమిత. వెర్రి పిల్లవి. ఎంతని ఎదురు చూస్తావ్? ఉత్తరం లేకుండా వట్టి చేతులతో రావటానికి నాకు చిరాకేసేదమ్మా." అని అన్నాడు పోస్టుమాన్. కమల పట్టరాని సంతోషంతో "అత్తయ్యా! బావ ఉత్తరం వ్రాసా డత్తయ్యా!" అని ఇంట్లోకి పరుగుతీసింది. "సుబ్బన్నా! వెళ్లిపోకుండు, మజ్జిగతెస్తున్నా" అంది మళ్లీ తరువాత గ్లాసుతో మజ్జిగను తెచ్చి పోస్టుమాన్‌కిచ్చింది. "ఎందుకమ్మా ఇప్పుడు?" అని కమల అందిచ్చిన మజ్జిగ గ్లాసును అందుకుని మజ్జిగ త్రాగేసి "ఇదిగో కమలమ్మా! ఈ మజ్జిగతో అయిపోలేదు సుమా? ఎంత నేగిరం పద్దీ—బూరులూ పెడతావా అని చూస్తూ కూర్చుంటాను." అన్నాడు సుబ్బన్న. పెళ్లి విషయం ఎత్తేసరికి కమల సిగ్గుతో తలదించేసుకుంది. పోస్టుమాన్ వెళ్లిపోయాక వాలు కుర్చీలో కూర్చుని ఉత్తరాన్ని చించి చదవసాగింది.

"మహారాజశ్రీ మామయ్యకి...

...నమస్కారములతో నీ మేనల్లుడు. నే నిక్కడ బాగా చదువుతున్నాను. అమ్మ ఇప్పుడు ఆరోగ్యంగానే ఉందని భావిస్తాను. నీ ఆరోగ్యం సరిగా లేదని ఆ మధ్య కమల ఓ

## ఆటకట్టు!

పదేళ్లుగా పడనిదీ
పదుగురూ కానన్నదీ
అందరూ మెచ్చినదీ
ఎవరూ ఊహించనిదీ

ధనం విలువ పెంచేదీ
ధరలని తగ్గించేదీ
ప్రగతికి దారి చూపేదీ
పెట్టుబడుల ప్రోత్సహించేదీ

సుఖ శాంతుల నిచ్చేదీ
సౌకర్యాల నందించేదీ
పేదరికాన్ని నిర్మూలించేదీ
పెన్నిధుల్ని సమకూర్చేదీ

ఇక మీరాదట:

వెట్టి చాకిరి రద్దు
వట్టి మాటలు వద్దు
అరాచకం 'ఆటకట్టు'
అందుకే ఈ '76 బడ్జెట్!

— మాధవ్.

ఉత్తరం వ్రాసింది. నాకు చాలా బెంగగా ఉంది. ముందు నీ ఆరోగ్యం విషయం చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. నా పరీక్షలు దగ్గరపడుతున్నాయి. పుస్తకాలకి, పరీక్ష ఫీజుకి డబ్బు కావాలి! త్వరలో మళ్లీ పరీక్ష ఫీజు కట్టాల్సి ఉంటుంది. ఈ నెలలోనే మా కాలేజీ పిక్నిక్ వుంది. నాకు ఖర్చులు కూడా ఎక్కువ లేవు. అందు నుంచి మీరెలాగైనా ప్రయత్నించి వెంటనే నాకు ఆరువందలు పంపితే నేనిక్కడ దేనికీ బాధపడవలసిన పని ఉండదు. మీరు జాప్యం చేస్తే నా చదువు దెబ్బతింటుంది. మీరిప్పుడు ఆరువందలు పంపినట్లయితే ఇకపై మీరు నాకు పంపనవసరం ఉండదు. మన ఇంటి ఆర్థిక పరిస్థితులు క్రితం కంటె మెరుగ్గా ఉన్నాయనుకుంటాను. ఈ ఒక్క సంవత్సరం మీరు శ్రమ పడితే నా చదువు పూర్తయి పోతుంది. తరువాత ఎలాగైనా ఉద్యోగం సంపాదించుకోవచ్చు. అందు నుంచి నేను మీకు వ్రాసినట్లు డబ్బు పంపగలరని ఆశిస్తున్నాను. ఏ పని చేయటానికీ తీరిక లేకపోవటంవల్ల మీరు చెప్పినట్లు తరుచుగా ఉత్తరాలు వ్రాయలేకపోతున్నందుకు క్షమించగలరని

గొప్ప బహుమతి

# రూ. 5,00,000

2 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 3,000

# కర్నాటక రాష్ట్రం లాటరి

## ఉగాది బంపర్ డ్రా 18-4-1976

రూ. 16,00,000 కు పైగా విలువగల ఉత్తేజకరమైన 14,118 నగదు బహుమతులు.

5 ప్రథమ బహుమతులు

## రూ. 1,00,000

10 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 2,000

5 ద్వితీయ బహుమతులు

## రూ. 10,000

10 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 1200

5 తృతీయ బహుమతులు

## రూ. 5,000

10 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 800

35 చతుర్థ బహుమతులు

## రూ. 1,000

70 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 200



105 పంచమ బహుమతులు

## రూ. 500

210 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 80

1050 షష్ఠమ బహుమతులు

## రూ. 100

2100 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 20

3500 సప్తమ బహుమతులు

## రూ. 50

7000 కన్సొలేషన్ బహుమతులు ఒక్కొక్కటి రూ. 10

80వ డ్రా

560 052

# వెలుగుబాట

ప్రార్థిస్తున్నాను, పు. ల. స. అత్తయ్యకి నా హృదయ పూర్వక నమస్సులు, చి. కమలకి ఆశీస్సులు.

ఉంటాను.

మీ మేనల్లుడు — గోపాలం.''

ఉత్తరం వచ్చినందుకు ఎంతో సంతోష పడిపోయిన కమల ఉత్తరం పూర్తిగా చదివిన తరువాత పూర్తిగా నీరసించిపోయి నట్లయింది. కళ్లలో గిర్రున నీళ్లు తిరిగి రెండు బొట్లు టపటపమని రాలిపడ్డాయి. ఉత్తరం అలాగే గుండెలకి అదిమి పెట్టుకొని భారంగా కళ్లు మూసుకుంది. కమలకు తన బావ మీద చెప్పరాని కోపం కలుగుతుంది. తన ఎదురుగా కనిపించినట్లయితే ఎన్ని మాటలనాలో అన్ని మాటలు అనేసి ఒక్కసారిగా ఏడిచేయాల న్నంత దుఃఖం ఆమె గొంతువరకు వచ్చి వుండిపోయింది కమలకి ఆలోచిస్తుంటే చిన్ననాటి పరిస్థితులు ఒక్కొక్కటే జ్ఞాపకం రాసాగాయి.

అప్పుడు కమలకి ఆరేళ్లుంటాయి. కమలకి స్వయానా అత్తయ్య కొడుకు గోపాలం. గోపాలానికి కమలనిచ్చి పెళ్లి చెయ్యాలని వాళ్లు చిన్నప్పుడే ఆ యింట్లో అంతా ఏకగ్రీవంగా నిర్ణయించేసారు. గోపాలం కూడా చిన్నప్పట్నుంచీ కమలనే అంటిపెట్టుకుని తిరిగేవాడు. కమల ఆడుకోవటానికి, బొమ్మల పెళ్లిళ్లు చేసుకోవటానికి ఆడపిల్లలతో వెళ్లిపోతుంటే, గోపాలం కూడా కమల వెనకాలే వెళ్తూ ఉండేవాడు. ఒకసారి కమల తనతోడి ఆడపిల్లలతో కలసి ఆడుకుంటోంది. ఆ మరునాడు అట్లతద్ది. కమల ఈడు పిల్లలంతా కమల చుట్టూ చేరి ''కమలా! కమలా! రేపట్ల తదియ నోము నువ్వు నోచుకుంటున్నావా?'' అన్నారు. కమల కళ్లు చక్రాల్లా త్రిప్పుతూ, ''ఊఁ...మా నాన్నగారు అప్పుడే జాంపళ్లు, అరటిపళ్లు అన్నీ తెచ్చేసారుగా!'' అంది. ''ఇదిగో కమలా! రేప్రొద్దున్న తలంటుపోసుకొని, పూజ చేసుకున్నాక, మనమంతా విజయా వాళ్లింటికెళ్లి ఉయ్యాలూక్కుందాం. రావే నువ్వుకూడా!'' ప్రాధేయపడుతూ అందొక అమ్మాయి.

గోపాలం మధ్యలో దూరి ''ఇదిగో, విజీ! నేను రావద్దా?'' అన్నాడు బతిమాలుతున్నట్లు, కమల పకపకా నవ్వుతూ, ''మా

బావ కూడా నాతోపాటుగా నోచుకుంటాడే విజ! అందుకే బావకూడా మనతో ఉయ్యా లూగడానికి వస్తానంటున్నాడు " అన్న కమల నుట్నాడున్న ఆడపిల్లలంతా గొల్లున న్నారు.

"ఎందుకర్రా ఆ నవ్వు? ఏం? ఆడ పిల్లలేకాని మగపిల్లలు మనుషులు కారేంటి? మేం మాత్రం ఎందుకు నోచుకోకూడదు? మీరయితే పళ్ళూ అవీ తినేయవచ్చని నోములు నోచుకుంటారు. మేమేమో పాపం నోచుకో కూడదు. అంతా కుర్రబుద్ధులే మీ ఆడ వాళ్లని " అన్నాడు బుంగమూతిపెడుతూ.

"పోనీ నువ్వుకూడా నోచుకో మంచి మొగుడు దొరకాలని " కమల చిలికోపంతో అన్న మాటలకి ఆడపిల్లలంతా మరోసారి

# వెలుగుబాట

గొల్లుమని నవ్వారు. అది చాలా అవమానంగా అనిపించింది గోపాలానికి. వెంటనే చేతిలో వున్న పలకతో కమల నెత్తిమీద గట్టిగా కొట్టాడు. పలక అంచులకున్న రేకు గీసుకొని, కమల నుదిటిమీద నుంచి రక్తం కారుతోంటే "అత్తతో చెప్పి, నీపని పట్టిస్తానుండమ్మా." అనుకుంటూ "ఊఁ... ఊఁ..." ఏడుస్తూ ఇంటికెళ్ళిపోయింది. ఇంటిదగ్గర ఆడపిల్ల లంతా గోపాలం తల్లితో గోపాలం కమలని పలకతో కొట్టినట్లు ఫిర్యాదు చేసారు. గోపాలం తల్లి "ఓసి వెర్రిముండా! ఎంత పని చేసాడే వెధవ?" అని కమలని గట్టిగా గుండెల కదుముకుని కళ్ళనీళ్ళు దింపుకుంది. తరువాత సున్నం పంచదార కలిపి దెబ్బ తగిలినచోట పెట్టి, "వాడు రానీ, ఇవాళ తొక్క వొల్చేస్తాను వెధవకి." అంది. పిల్ల లంతా వెళ్ళిపోయారు, తరువాత. చీకటి పడు తున్నా ఆ రోజు యింటికి చేరుకోలేదు గోపాలం. అంతవరకూ కట్రపట్టుకొని కోపంగా కూర్చున్న గోపాలం తల్లికి దగ్గరగా వెళ్ళి కమల "అత్తా! బావ యింకా రాలేదేం అత్తా?" అని భయంభయంగా అడిగింది. "ఎక్కడో దాక్కొని ఉంటాడు. చీకటిపడితే వాడే వస్తాడు ఆకలేసి. రానీ, ఇవాళ వాడి అంతు తేలుస్తాను." అంది ఇంకా తగ్గని కోపంతో. వెంటనే కమల ఏడుపు ప్రారంభించి రెండు చేతులతోనూ కళ్ళు నులుముకో సాగింది. గోపాలం తల్లి గాభరా పడిపోతూ "ఏం తల్లీ? ఏమైంది? అఁ..." అని

"అత్తయ్యా!...నువ్వు... బావను ... కొట్ట కత్తయ్యా!" అని మళ్ళీ. "బావ తప్పు చెయ్యలేదత్తా. బావకూడా నోము నోచు కుంటానన్నాడు ... నాకు నవ్వు వచ్చి నవ్వితే...బావ పలకతో కొట్టాడు కోపంతో.. అసలు కొట్టాలనుకోలేదత్తా." అని కమల అంటుంటే, కమల తల్లి, గోపాలం తల్లి అంతా గొల్లున నవ్వారు. "పిచ్చి తల్లీ. బావంటే ఎంత అభిమానమమ్మా." అని కమలను దగ్గరగా తీసికొని గట్టిగా ముద్దు పెట్టుకొని, "కొట్టనులే. వెళ్ళి ఆడుకో." అంది కమల మేనత్త. అంతలో ఎక్కణ్ణుంచి ఊడిపడ్డాడో కాని తుర్రున వీధిలోంచి వచ్చాడు గోపాలం.

(ఇంకా వుంది)







ఇవాళ ఏ వేషం
వేద్దాంరా. అడు
క్కోడానికి కుంటి
వేషమా గుడ్డి
వేషమా
PRABHA



## ఉద్యోగ ధర్మం—పెళ్ళి !

ఫ్లోరెన్సుకు చెందిన రాబర్ట్ ట్యుడిస్కో అనే ఆయన వో కంపెనీలో రిప్రజెంటేటివ్ వుద్యోగం చేస్తున్నాడట. అతని పెళ్ళి ముహూర్తం నాటికి కూడా వుద్యోగ ధర్మంప్రకారం తిరగాల్సివచ్చిందట పూరూరా. దీని కాతనో పథకం వేసి, పెళ్లి ఏర్పాటులన్నీ చేసేసుకోమని చెప్పి వెళ్లిపోయాడట పెళ్లి నాడు అతను విమానంలో ప్రయాణం చేస్తున్నాడట. లెక్క ప్రకారం విమానం తన పెళ్లి నిశ్చయమైన చర్చి ప్రదేశానికి రావడంతోనే తానూ, తన పెళ్లి చూడాలనే మరో యిద్దరితో సహా ప్యారాచూట్ల సహాయంతో ఆరు వేల అడుగుల ఎత్తున ప్రయాణం చేస్తున్న విమానంలోంచి దూకేశారట. అనుకున్న ప్రకారం భూమ్మీద వాలి, ఝూమ్మని పెళ్లి చేసేసుకున్నాడట. 22ఏళ్ళఅంగీలా అడిలెట్టా అనే ఆమెను. హవ్వరా!

## 24 గంటల్లో కట్టిన యిల్లు !

కొచ్చిన్‌కు చెందిన కేరళ ప్రభుత్వ యింజనీరు మిస్టర్ శ్రీధర వాధ్యార్ అనే ఆయన తాను 24 గంటల్లో నివాసయోగ్యమయిన యిల్లు కట్టగలననీ, అంతేగాక ఆ యిల్లు మరో చోటికిమార్చు దానికి కూడా వీలుంటుందని అనడమే గాక అంత పనీ చేసి, చూపించాడట. ఆ యింటి భాగాలన్నీ మూస పోసి సిమెంటుతో తయారు చేశాడట. ఇల్లు కొలతల ప్రకారం నేలమీద ముఖ్యమయిన స్తంభాలు పాతుకున్నాక, యీ భాగాలు అమర్చి బిగించడమే నన్నాడటాయన.

## మరణ కారణం

సెటర్‌పాళాయం అనే వూరుకు చెందిన 75 ఏళ్ల పళనియమ్మ అనే సుమంగళి నీళ్లు తోడుకుంటూ కాలుజారి నూతిలో పడి, చనిపోయిందిట. ఆమె కొడుకు 43 ఏళ్ల నాగప్పన్ శవాన్ని బయటకు తీసి, యధావిధి కర్మకాండలు చేసేశాడట. ఈ విషయం తెలిసిన పోలీసు మామూలు మరణం కానందున, "ఈ విషయం మాకు తెలియపరచకుండా శవానికి ఎలా కర్మకాండలు చేశావు" అని ఆ నాగప్పన్ని అరెస్టు చేశారట. శంఖంలో పోసినదే తీర్థం

## దీని అర్థం ఏమిటి ?

తిరుమూరుకు చెందిన 20 ఏళ్ల లీల అదే వూరుకు చెందిన వో మన్మథరావును ప్రేమించిందట. వీరిద్దరి ప్రేమనూ పెళ్లివరకూ వెళ్లనీయలేదట పెద్దవాళ్లంతా చేరి. దాంతో లీలకు జీవితంమీద విరక్తిపుట్టి చివరకు నిప్పు అంటించుకుని కాలి చనిపోయిందట. చనిపోయాక ఆమె శవాన్ని పెరట్లోని పాకలో ఆమె తలిదండ్రులు చూశారట.

## సైలికవుతున్న విడాకులు !

వివాహాలే గాక, విడాకులు కూడా వెంచక్కో ఏ కష్టనష్టాలూ లేకుండా అనుకోడంతో, అంత

## ఫాలాక్షుని డైరీ

సుఖంగానూ జరిగేలా చట్టాలను సవరించనున్నదట కేంద్ర ప్రభుత్వం. ఈ విషయం కేంద్ర మంత్రి గోఖలే అన్నారట. అయ్యో, విడాకులు యివ్వడం చాలా కష్టమనీ, అంతకన్నా ఏదో విష్ణు స్త్రీయు కాపరం చెడను మలువని వారామంచు కాపరాలే చేసుకుంటున్నారు అంటేగా కోర్టు దాకా అలో గమ్మున విడాకులవరకు వెళ్లిపోయినదంపతులు కోపతాపాలు చల్లారి మనస్సు కుదుటపడ్డాక వెళ్లి సర్దుకు పోతున్నారు కొందరు విడాకులు దొరక





## ఫాలాక్షుని డైరీ

కష్టనష్టాలే గాక, నరకం కూడా అనుభవిస్తున్నారు ఏ సంస్థకయినా లాభం వెంటనే నష్టం కూడా వుంటుంది కదా'

### మంటలకి భయపడితే ప్రాణం తీసిన పొగ!

శ్రీకాకుళం జిల్లా ఒపురుపల్లి తాలూకాకు చెందిన ఆనందపురంలో 23వ తేదీన వో యిల్లు అంటుకుని మంటలు తారామండలానికి లేచాయట ఆ మంటలకు భయపడి కొంతమంది గమ్మున పక్కింట్లోకి దూరి తలుపులు బిడాయించుకున్నారట ఆ మంటల వల్ల వచ్చిన పొగయీ పక్కింట్లో దూరి, చుట్టుపెట్టడం వల్ల వూపిరాడక, ప్రాణవాయువు కరువై ఆ గుంపులో ఏడుగురు స్త్రీలు, నలుగురు పురుషులూ చనిపోయారట.



### గురువాయూరప్పన్ తిరునాళ్ళలో ఏడుగురి మృతి

గురువాయూరప్పన్ (కేరళ) కోవెల్లో శ్రీ శ్రీకృష్ణుని పుత్సవాల సందర్భంలో కొలనులో శ్రీకృష్ణునికి తెప్పవుత్సవం జరుగుతోందట ఫిబ్రవరి 20వ తేదీన ఆ తెప్ప ఉత్సవానికి కొలనులో కట్టిన తెప్పకు కరెంటు తీగలను గుడిలోంచి తీసుకువెళ్ళారట అయితే యీ తీగల నేలమీదుగా తీసుకువెళ్ళడం వల్ల భక్తులు తొక్కిడిలో కొందరు ఆ తీగలమీద పడ్డారట వీరిలో ఏడుగురు మాడి, చనిపోయారట చాలా మంది గాయపడ్డారట.

### పెనాంగ్‌లో భారతీయుని హత్య

పెనాంగ్ ఇన్‌లాండ్ రెవెన్యూలో అసిస్టెంటు డైరెక్టరుగా పనిచేస్తున్న సదాశివన్ అనేఆయనను ఎవరోహత్యచేసి, ఆయన శరీరాన్ని ఆయనింటికి యిరవై గజాలదూరంలోవున్న వో డ్రయినేజిలో పడేసి పోయారట సదాశివన్ భారతీయుడట (నాచురల్లీ) ఆయనకు భార్య, వో మూడేళ్ళ కొడుకూ వున్నారట సదాశివన్ ఆఫీసుకువెళ్తూండగ యీ రాక్షస కృత్యం, జరిగిందని పోలీసు అన్నదట నోడెవలప్మెంట్సు

### సహాయం చేయబోయి ఊబిలో యిరుక్కున్న అమ్మాయి

రాజకోటకు 90 కిలోమీటర్ల దూరంలో దోలాజి అనే పూరు ఎదురుగావున్న చెరువులో ఒక 25 ఏళ్ళ ఫాతిమా అనే అమ్మాయి బట్టలు వుతుక్కుంటోందట ఆ ఎక్కడే కొందరు కుర్రాళ్ళు స్నానం చేస్తున్నారట ఆ కుర్రాళ్ళు మరి కొంచెం లోపలకు వెళ్ళి అక్కడున్న వూబిలో కూరుకుపోతూ ఆర్తనాదాలు చేశారట దాంతో ఫాతిమా పరుగున వెళ్ళి వో కుర్రాడి చెయ్యి పుచ్చుకుని బయటికి లాగి, మరో కుర్రాడిని లాగుతూ, తానూ ఆ వూబిలో యిరుక్కుపోయిందట సహాయం అందేలోగా ఆ కుర్రాడితో పాటు ఆమె వూబిలో కూరుకుపోయిందట

### కొండనాలిక్కి మందేస్తే...

సేలం తాలూకా తిరువెంగోడుకు చెందిన వరమూప్పం అనే వూరిలో 22 ఏళ్ళ ఎల్లమ్మాల్ అనే ఆమెకు భయంకరమైన కడుపు నొప్పి వచ్చి, వచ్చినప్పుడల్లా విలవిల్లాడి పోయేదట వెలివరుత్తి (వో చెట్టు తెలుగులో ఏమిటో) అనే చెట్టు ఆకులు నూరి, ఆ పసరు తాగితే నొప్పి తగ్గుతుందని ఎవరో చెప్పడం వల్ల అంత పనీ చేసిందట కానీ ఆ పసరు విషమట తత్ఫలితంగా ఆమె చనిపోయిందట

## ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

ఉపపాదించాడు. అందు నలదూత్యములో నొక సందర్భమున్నది.

దమయంతి వరుడైన నలుని వరించింది అయితే ఇంద్రాదిదేవతలు ఆమెను వరించి, ఆమెకొరకు ఉబలాటపడి, నలునే, దమయంతివద్దకు దూతగా వెళ్ళి, తమ సందేశాన్ని వినిపించి, కార్యసాధన చేసికొనిరావలసినదని, కోరారు. నలుడట్లే దమయంతివద్దకు వెళ్ళాడు ఇంద్రాదుల సందేశం వినిపించి, ఎన్నివిధాల ప్రోత్సహించాలో అన్ని విధాలుగా ప్రోత్సహించాడు. కాని దమయంతి ససేమిరా నేను ఇంద్రాదులను చేసికోను అని ఖండితంగా చెప్పి వాళ్ళ బలవంతంచేస్తె ఆత్మహత్య చేసుకుంటానని చెప్పింది

నలుని దౌత్యం భగ్నమైంది. అప్పుడు శ్రీనాథుడిట్లు వర్ణిస్తాడు.

ఉ. "అదిః బరోపకారపరులై చరియించిన యట్టి యాంజనే
యాదులఁ బోలనైతి, నిపుడక్కట దైవత కార్యసిద్ధివి
చ్ఛేదమునందె" (నైష—4—25)

"అయ్యో నేను ఆనాడు హనుమంతుడు సీతకు రామసందేశము నందించి తిరిగి శ్రీరామునకు సీత సందేశము నందించినట్లు కృతార్థుడను కాలేక పోయినాను" అని విచారిస్తాడు

హరిశ్చంద్రుడు, నలుడు, పురుకుత్సుడు పురూరవుడు సగరుడు కార్తవీర్యార్జునుడు వీరు షట్చక్రవర్తులు కృతయుగమువారు శ్రీరాముడు త్రేతాయుగమువాడు అయినను, శ్రీ హర్షుడు దీనిని నలకథలో అనుసంధానించాడు. ఇంకొకటి దమయంతి వివాహమునకు ముందు కలిరాజు (అనగా కలియుగ పురుషుడు) ఇంద్రాదులకు ఎదురుపడతాడు. ఇంద్రాదులు "నీవు నలమహారాజును దమయంతిని కష్టములపాలు చేయకు" అని అతనితో చెబుతారు.

ఇప్పుడు కలి ఇట్లా అంటాడు నేను మీ కొరకే ఇచ్చటికి వచ్చినాను.

"అవధరింపుడు—పాకశాసనుండు, పావకుండు,
(ఇంద్రుడు) (అగ్ని),
ప్రేతపతి పాశహస్తుడు వంచయుండనైన
(యముడు), (వరుణుడు)

నేను— ఏయ్యేవురము పాండవులు పాంచాలినిం
బోలె పంచుకొని యనుభవింతము(నైష—4—103)

నల కథ జరిగినది కృతయుగమున పాంచాలీ పాండవుల కథ (భారత కథ) జరిగినది ద్వాపర యుగమున చెప్పుచున్నవాడు—కలి—ఇంకను మన చరిత్ర ఆమూక్త మాల్యదల యందిట్టి కాల వ్యత్యాస సంఘటనలు గలవు. విస్తరణ భీతిని విరమించుచున్నాను.

ప్రేరకలోకము దీనిని సాదరముగా గ్రహింతురని ఆకాంక్షించుచున్నాను.

కళాప్రపూర్ణ నిడదవోలు వేంకటరావు (హైదరాబాద్)



## యువతరం

27-2-76 పత్రికలో శ్రీ ఓ. నాగేశ్వర రావుగారి యువతరం పరిచయంలో తనకు అభి మానతారలు కరువయ్యారని, ఈ తెలుగు తారలు అసభ్య ప్రవర్తనలుచేసి అభిమానం పోగొట్టు కున్నారని వ్రాశారు. హిందీలో హేమామాలిని ఒక అపూర్వనటి అని తెలియపరచారు. కాని తెలుగు చిత్రసీమలో శారద, జమునలాంటి ఉత్తమకళా కారులు ఉన్నారని (అసభ్య ప్రవర్తనలు లేకుండా) బహుశా మరచి పోయారు. రెండుసార్లు ఊర్వశి బిరుదపొందిన 'ఒక' ఊర్వశి ఏ చిత్రంలోను అస భ్యంగా ప్రవర్తించలేదే. ఇక హేమ హేమామాలిని గురించి చెప్పాలంటే, లావు కాస్త అసభ్యంగా

## ఉత్తరాలు

నటించిన దుపారుస్తుప్ హిందీ చిత్రంలోనే శ్రీరంగపుగారు చూడలేదేమో!

న్యాయపతిమూర్తి ఓరంపురం-1 (గంజాం)

### "నోటీసులు"

నోటీసులు కథ చాల బాగుంది. కాని జాంపండుకథ అసలుపేరు సరిగా అతకలేదు కె. రామలక్ష్మిగారి ప్రశ్నావళి అత్యంత ఆకర్షణీ యంగ వుంది. కార్టూనులు ఇంకా ఎక్కువ ప్రచు రించగలరు.

యువతరం శీర్షిక తొలగించాలనుకున్నట్లుగా ఒక పాఠకుడు ఉత్తరం వ్రాశాడు. యువతరం పత్రి యువతీ యువకుల భావాలను యువతరం శీర్షి ద్వారా వెలువరించడం తగిన కాదా తీర్చుకోవలసి విజ్ఞానములో ఓవటగా గమనించి ఆ పాఠకుడికి తెలియచేస్తున్నాను.

ఎ. సురేందర్ రావు స్నేహబృందము (జగిత్యాల)

### సామాన్యుని సణుగుడు

(ప) హా పత్రికలో వచ్చు కథలన్ని హాహా నుకంపు ముఖచిత్రము 'హైలైట్' సామాన్యుని సణుగుడు 'క్లాస్' సినిమా 'బ్యూటిఫుల్' సీరియల్స్ 'అహా చెప్పలేను'

జి. వెంకటరావు (యర్రబాలెం)

## పెండ్లి ఫోటోలు

కటూర్



పెండ్లికుమారునకు మామగారు బట్టలు ఇస్తున్నప్పుడు తీసిన ఫోటో



జీలకర్ర బెల్లం పెట్టినప్పుడు తీశానండి. పెళ్లికూతురు అక్కగారు నగలు సర్దుతూందండి!



ఇది తాళిబొట్టు కట్టేటప్పుడు తీశానండి జడ బాగా పడిందండి



మేనత్తగారు మట్టెలు, చీర, రవిక ఇయ్యబోతుండగా తీశానండి.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# "నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు.



**ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరీ నేప్‌కిన్‌లను గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!"**

**వండర్‌రాప్‌గల క్రొత్త కేర్ ఫ్రీ స్త్రీయొక్క దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.**

నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేకమైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను తీసుకొనుటకు యిప్పుడు కేర్ ఫ్రీ ఉంది.

కేర్ ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్‌రాప్ చెమ్మను లోపలి పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్ ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి చెమ్మను ఏకరీతిగా చేరేలా చేసే, ప్రత్యేకమైన పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది. అందువలన ఒకేచోటు తడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్ ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటె, దానిని ఉపయోగించిన తరువాత సులభముగా 'ఫ్లష్' చేయవచ్చును. కనుక మీరు బయట తిరుగునపుడు లేక ప్రయాణములో చికాకు పడరు.

కేర్ ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా సరిపోయేలా మార్చుకోగలిగే సైజులో లభిస్తోంది. ప్రతి ప్యాకులోను ఉచితముగా యివ్వబడే కేర్ ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో 30 పూర్తి రోజులు హాయిగా ఉండగలరు!**

ఇంకా, ఎక్కువ మంచి వస్తువుల కావాలనే స్త్రీలకు క్రొత్త, మేలు రకపు, మార్చుకోగలిగే బెల్టు విడిగా అమ్మబడుతోంది దానిని కేర్ ఫ్రీ సానిటరీ నేప్‌కిన్‌లను అమ్మే షాపులలో చూడండి.

ఇప్పుడు చేతిలో యిమిడే క్రొత్త పోలి బ్యాగ్‌లో




**జాన్సన్ & జాన్సన్® స్త్రీలకు హాయియైన రక్షణకు**